# రాయబారము

[ కవిబ్రహ్మ ఉద్యోగపర్వము మాతృకగా గ్రహించి చేసిన వచనము ]

కర్త:

మొహామ్మద్ ఖాసింఖాన్, ఎమ్. ఏ.

ప్రకాశకులు:

లక్ష్మీ గ్రంథ ప్రచారిణి, తెనాలి.

1942 [వెల రు 1-4-0

# తొలి పలుకు

భారత సాహిత్యమునందువలె ఆంధ్రవాఙ్మయమున మహాభారతము తలమానికము. కవిత్రయ రచితమగు ఆంధ్రమహాభారతమున తిక్కన కల్పన సాటిలేనిది. తిక్కన కవిబ్రహ్మ. తిక్కన తీర్పు తెనుగు తీపులు చిమ్మినది. తిక్కన తెలుగును రూపునకుఁ దెచ్చినాఁడు; దిద్ది తీర్చినాఁడు; అమృతము పోసినాఁడు; బ్రదుకుదెఱువు ఏర్పఱిచినాఁడు. అందుచేతనే తెలుఁగుకు తిక్కన ఋణము తీర్చుకోజాలనిది.

కవితా చాతురియందు తిక్కన వ్యాసుని మించినాఁడు. "అందచందములు శోభింపని యెడల పడియుండెట్టి వ్యాసుని రచనను, తిక్కనకవి దగ్గఱకుఁ దీసి దిద్ది తీర్చి, ముద్దు ముచ్చటలం గూర్చి మాట మలుపులు నేర్పినాఁడు......ఆత్మ సంభూతమగు భారతసంతానమునందలి వివిధ వైలక్షణ్యాగ్ని చిత్తవృత్తులను చిత్రించినాఁడు వ్యాసభగవానుఁడు దానికి మెదిచి, మెఱుఁగులిచ్చినాఁడు తిక్కనకవి."

తిక్కన మహాకవి శైలి నిరలంకారము, నిరాడంబరము, నిగ్రహబద్ధము; అతని కథ నాటకీయము. అతఁడు చిత్రించిన పాత్రలు మన ఎదుట ప్రత్యక్షమగునట్లు చేయఁగల శక్తి తిక్కనది. పాత్రౌచిత్యము, సన్నివేశ రచనాచాతుర్యము, భావానుగుణ సంభాషణాక్రమ నిర్వహణమునందును తిక్కన యసమానుఁడు.

తిక్కన కృతమగు ప్రతి పర్వమందును ఈ కవితాశక్తి కన్పించుచున్నను ఉద్యోగపర్వమున నిది మిన్నందినది. ఉద్యోగపర్వమున భారతకథయందలి పాత్రలన్నియు తమ తమ వ్యక్తిత్వములను ప్రదర్శించుచున్నవి. ఈ ప్రదర్శనమును ప్రౌఢశిల్పకౌశలముతో తిక్కనమహాకవి నిర్వహించినాడు.

తిక్కన మహాకవియొక్క ఈ అద్భుత రచనను వచనముగా చేసిన యెట్లుండునో యని శ్రీకృష్ణ రాయబారమును వ్రాసినట్లే ఉద్యోగపర్వ తృతీయాశ్వాసమును మొట్టమొదట వచనముగా చేసి నా శ్రేయోభిలాషులగు సాహిత్యస్థాపక శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారికి జూపితిని. వారు తమ సహజౌదార్యముతో దాని నాదరించి నన్ను ప్రోత్సహించిరి. గురుసమానులయ్యు నన్ను మిత్రునిగ నాదరించు బ్రహ్మశ్రీ కురుగంటి సీతారామయ్యగారి ప్రోత్సాహమును దీనికి దోహదమైనది. వీరి యాదరము నూతగా గొని ఉద్యోగపర్వము నీ విధముగ వచనమున రచించి యాంధ్రలోకమునకు సమర్పించ సాహసించితిని. ఇందలి గుణములు తిక్కనమహాకవివి. దోసగులు నావి.

హైదరాబాదు,
1-7-42.

మొహమ్మద్ ఖాసింఖాన్.

# రాయబారము

## ప్రథమాశ్వాసము

అభిమన్యుని పెండ్లియై నాల్గుదినము లాయెను. ధర్మతనయుండు తన తమ్ములును గొపకులును బరివేష్టించియుండ విశాల రమణీయ మగు విరాటు కొలువుకూటమున కరిగి యుండెను విరటుండును, పాంచాలుండును, కృష్ణ బలరాములును, వారి యనుజ తనయులును, పరిణయమున కాగతులైన యఖిల ధరణీశులును బలసియుండ సుఖసల్లాపములు సేయుచుండెను. ఇట్లు సభాసదులైన మానవేంద్రులు నానావిధములగు కృష్ణ యుధిష్ఠిరులతో సంభాషణములు సేయుచుండ పాండవపక్షపాతియగు కృష్ణుండా సంభాషణములు వారించి వారలఁ గలయం గనుఁగొని యిట్లనియె:

పాండవంశజులో చర్చ

"పాండవులు కపటద్యూతమున సౌబలునిచే నాత్మీయరాజ్యపదభ్రంశము నొంది శక్తియుక్తులై యుండియు సత్యనిరతినిఁ గుపితస్వాంతులుగాక, తాము గొన్న శపథములఁ బాలించి, విపినావాసమును, నజ్ఞాతవాసమును సలిపిరి. ఈ విధమున పాండవేయులు పండెండు సంవత్సరములు క్రూరమృగదానవాకీర్ణమగు కానల వసించి తర్వాత దుస్తరమగు నీ పదుమూఁడవ యేఁడును గడపిరి. మీరు ధర్మజ్ఞ వర్తనఁ గోరిన వారలుగదా? కావున ధర్మమార్గముఁ దప్పక గాంధారేయులకును పినలకును హితముగా నొక్క తెఱఁగు

నాలోచింపుఁడు. యుధిష్ఠిరుఁడు ధర్మువు దప్పి యయ్యుగ్రపదవిని గొనఁ
బడయ నోడఁబడఁడు. ఉచితగతి నెంత లభించినను నుల్లసిల్లును.
కావునఁ బాండవులకుఁ బిత్రృధనమగు రాజ్యము నిప్పు డుద్యోగమున
దుర్యోధనుఁ డపహరించుటయు, ఇది మీరు దిగ్విజయము చేసి
యలవరించుకొన్న పదమగుటయు, ధర్మసూను మహానుభావము
విచారింపక ధార్తరాష్ట్రులు పరిభవించినను నితఁడు వారలకుఁ గీడు
సేయ రోయుటయు మీ రెఱుంగుదురు. కురురాజ్య మీ రెంటి పక్ష
ములవారికిఁ బంచి కుడువఁజనునదగుటచే మీరు తగిన కార్యము
సెప్ప నర్హులు. నేనును నా కిష్టమంత చెప్పెద వినుఁడు."

"కుంతీతనయులు శాంతతకై సమయము నడిపి, యిప్పుడు
కోపోద్రిక్తులై తమ భుజబలమును దుర్దాంతోద్యమశౌర్యమును
నెఱింగింతు మనుచున్నారు. వీరి తెఱఁ గెఱింగిన
గాంధారీతనయుఁడు బలము కొద్దిగనున్నప్పుడే వీరిని
జయింపనగునని తలఁచి తన సుహృద్బాంధవులఁ
గూర్చుకొనును.

కృష్ణ వాక్యములు

అనంతములగు శత్రుసైన్యములను తగు బలము లేక గెలుంతు
బలవిక్రమోదాత్తులకైనను దోర్గర్వమునఁ గెలువ వశము కాదు
గదా! కావునఁ బాండవపక్షపు భూవల్లభకోటి యుచితరీతి
పాండవశత్రువులతోఁ బోరుదురు. ఇది యిక్కడి తెలియఁగొనఁదగిన
దోఁచిన తలఁపు. అక్కడి వారి చిత్తవృత్తి యెట్టిదో తెలియదు
గము. ఎదిరిమత మెఱుంగక యెట్టి కార్యమునైనను నిశ్చయింప

లను కలిసి గాని దుర్యోధనాది శతము నొక్క త్రుటిలోన నిశ్శేషముఁ జేయుఁడా? ఈ మత్స్యపతి సామాద్యుపాయపరుఁడు; ఉద్దామ భుజాబల యుతుఁడు; సాహసాన్వితుఁడా? ఇతని సహాయమున మాకుఁ [illegible] కార్యము గలదే? అందుచే సంగ్రామము సేయుటయు కార్యమని నా మతము. ఇట్లు గాక కౌరవపతితో సామవచనముల నాడ బుచ్చెద రేని యా దూత యుచితముగ స్థైర్యమును జూపక, కార్యపరుఁడగు ధర్మజుని [illegible] పాలు పాలు సస్మరించి వేఁడు చున్నాఁడని చెప్పవలెను. లోకసామాన్యవిధి నాతఁడు సంతోషముగ నిచ్చినఁ బుచ్చుకొందము. [illegible] ఫల మనుభవింతురు గాక!"

అనిన ద్రుపదుఁడు: "ఇది యుచితముగ నున్నది. బలదేవు నకు సరి గాదు. బాహ్లీక ప్రముఖులును, దుశ్శాసనుఁడును నైన ప్రముఖులు [illegible] కార్యము [illegible] సర్వము; అతఁడు యుద్ధమునఁ గాని చక్కఁబడఁడు." అని పలికి మరియు నిట్లనియె:

"దుర్జనహృదయములు సజ్జనభాషణముల ప్రసన్నములగునే? గురుభీష్మాదులచే [illegible] మద [illegible]. అదియును గాక సార్వభౌ మఁడు గుణహీనుఁడైనను భీష్మద్రోణులు [illegible] వాని ననుసరింతురు. ధృతరాష్ట్రుఁడును తన [illegible] పుత్రస్నేహాన్వితుఁడు. గాంగేయునివంటి [illegible] [illegible] సద్బుద్ధి యుండరు. కావున నతఁడు దుర్వినీతుఁడై యుండును. ఎట్లు జూచినను యుద్ధమగుట తథ్యము. ఈ సమయమున

బలములఁ గూర్చికొని పిలువఁదగు రాజులఁ బిలిచి పుచ్చవలెను. దుర్యోధనుఁడును దోడాసపడి దూతలఁ బంపును. ఉచితపరులగు నరపతులు దొలుతఁ జెప్పిన వారికి సహాయముఁ జేయఁజూతురు. మనము వడి గల కాలరుల వేగమ పుచ్చి శల్య కేకయ ధృష్టకేతు జరాసంధతనయ ప్రభృతులైన భూపతులకును, వారివారి బంధు మిత్ర జనములకును నెఱిఁగించి పుచ్చుట కార్యము. ఇది నాకుఁ దోఁచిన విధము."

అని పలికి తనకెలన సముచితాసనమున నున్న విప్రవరుఁ జూపి:

"ఇతఁడు నా యగ్రపురోహితుఁడు. ఎల్లపనుల నెఱిఁగింది యిత నిని ధృతరాష్ట్రుకడకుఁ బంపుఁడు. ధృతరాష్ట్రుని సమ్ముఖమునను, దుర్యోధనుని కడను, భీష్ముని సన్నిధిని, ద్రోణు నొగ్గరు క్రమోచితముగా నీ యీ విధములఁ జెప్పుమని చెప్పి పుచ్చుట యుచితము."

పాండవులు దూతను బంపుట

అనిన వాసుదేవుఁడు :

"పాంచాలపతి వచనము లుచితములై యున్నయవి. అట్లు చేయవలయును." అని పలికి మఱియు నిట్లనియె:

"కౌరవులకును పాండవులకును నే నొక్కరూప. అట్లగుట వారును వీరును తమతమ రాజ్యభాగములు సుఖముగ నేలుకొనఁ జూడ నెంతును. పెండ్లికై పిలిపించిన వచ్చితిమి; ఇన్నాళ్లు నెల్ల యొప్పిదములఁ జూచితిమి; ఇయ్యెడఁ దడవుదాఁక నిలువఁ దీఱదు. మాకు పోయి రావలయును."

అని పలికి ద్రుపదు నాలోకించి:

"మీరు మా యెల్లరకును గురుస్థానము. మీ మాట యనిన ధృతరాష్ట్రుఁడు బహుమానము చేయును. మిమ్ము శాంతనవుఁడును గౌరవించును. మీయందు ద్రోణ కృపాచార్యులు సఖ్యము వాటింతురు. అట్లగుటఁ జేసి పాండవార్థమై యొక్క రాయబారిని పంపుట మీ భాగము. మీ పలుకు కౌరవులు వినుదురు. మీరు చక్కఁ గిద్ది చేవగా మిగిలి యుద్రేకులైన వారు చెడుదురు. ఒకసారి పొందైన మంచిదే. అంతగాక విరసమైనచో రాజులనెల్లను ముందర రావించి పిదప మమ్ము పిలువఁబంపుఁడు. మీ పనుపున ధార్తరాష్ట్రులు పాండవేయులకు రాజ్యము పాలీకున్నచో భుజాటోప భయంకరుఁడగు నర్జును కోపానలము వారి నవలి ముట్టుకొన కుండునా ?"

అని మురాంతకుఁడు గమనోన్ముఖుఁడై ద్రుపదుఁడును, ధర్మనందనుఁడును, సహోదరులగు తమ్ములును, మత్స్యమహీవిభుఁడును తన్ననుప, హలాయుధ ప్రభృతి యాదవలోకము తోడరాఁగ నిజపట్టణమునకుఁ బోయెను. వివాహ మహోత్సవమునకు వచ్చిన తక్కటి రాజులును సంగ్రామ సన్నాహమునకై తమతమ పురములకుఁ జనిరి. కౌంతేయులు సమరమునకుఁ దగునుద్యోగమునఁ బ్రవర్తిల్లిరి. మత్స్యేశుఁడును సన్నాహము చేసెను. ద్రుపదుఁడును సన్నద్ధుఁ డయ్యెను. ఇట్లు సన్నద్ధులై వెలిచూపు విడిచి తమకు సమరస్థులైన రాజుల పాలికిఁ దగు దూతలఁ బుచ్చిరి.

పాంచాలపతి యజాతశత్రు ననుమతి వడసి వయోవృద్ధుఁ
డైన తన పురోహితుని ధృతరాష్ట్రు పాలికిఁ బుచ్చువాఁడై యాతని
రావించి :

"హితుఁడవు; మతిమంతుఁడవు, చతురవచనకోవిదుఁడవు; సమ
యజ్ఞుఁడవు; ఉన్నతవంశవర్ధనుఁడవు; ఇంగితవేదివి; నాకు నచ్చినవి.
నాకుఁ గర్తవ్యమగు పని నీకుఁ జెప్ప దగదు గావున వెంటనే పోయి
ధృతరాష్ట్రు పాలి కరిగి నేర్పు వాటించి కార్యము దీర్పవలయును."

అని చెప్పి రొమొడఁబరచి యాతనితో మఱియు నిట్లనియె :

"ధృతరాష్ట్రుఁడు కుటిలుఁ డగుటయు, ధర్మజుఁ డనుపమానబలుఁ
డగుటయు నీ వెఱుఁగుదువు. ఐనను పాండవులపైఁ బుద్ధి పోవునట్లు
బోయి నీవు ధృతరాష్ట్రునితో ధర్మనిష్ఠమైన యుచిత మాడిన స్నేహితులగు
వారి మనస్సులు మన కనుకూలముగ మారుట వింత కాదు. మఱియు
భీష్మాదులు యుద్ధమున కియ్యకొనకుండుటయు, పరస్పరమును భేదము
లుండై యుద్ధము సేయఁ గడఁగుటయు నిప్పుడు సిద్ధముగ నున్న సైన్య
ములకు నిరుత్సాహకరమగును. పండిత వృద్ధ సజ్జనుల పాలికిఁ బోయి
పాండుతనూభవులు పడిన పాటులు బంధువులకెల్లఁ దెల్పుచు, నిది
కులోచితము కాదని చెప్పి, 'ఇదియ మేలు; ఒండొకచందము తప్పు'
అని తక్కటివారు తలఁచునట్లుగాఁ జేసి సమస్త జనుల మనస్సులను
పాండవపక్షమున కనుకూలించునట్టి యుపాయము లన్నియు నవలం
బించునది. ఇచ్చట విరాటు కొలువునఁ బాండవులు గ్రుచ్చి పలుకఁ బలుకు
లును వింటిమి. తదనుగుణముగఁ బలికి పాండవులకుఁ జేటు

లాభముఁ గావించుట కర్తవ్యము. నీవు కరినగరమున వసియించి ధృతరాష్ట్ర ధార్తరాష్ట్ర గాంగేయ విదుర గురు కృపాదుల కడ కరిగి నానాఁటికి వారి వారి చిత్తములఁ దెలిసికొని ప్రవర్తింపుము. దైవ గతిం జేసి నీ యొద్దిక సూత్రమునకు సుయోధనుఁ డొడంబడెనేని, యుద్ధము సకలజన సమ్మతమైన విధము. కాన నజాతశత్రుఁడును మిత్రుఁడగును. ఇట్టి దృష్టి" అనిన సమ్మతించి పాండవులను పాంచాల విభుని, శిఖండిని, ధృష్టద్యుమ్నుని, భీముని, నరుని, నకులుని, సహదేవుని, గని యనుమతుఁడై పాండవకార్యార్థియై కరిపురమున కరిగెను.

౨

పురోహితుఁడు సకల రాజన్యసమూహ్యముగ గోపాలదేవు పాలికి దూతను బుచ్చుట దగునగునా కాదా యని విచారించి తాను స్వాగతముగ వచ్చిన భాగుంపుసని కరిపురపరిజన సహి తముగ శ్రీకృష్ణు పురమునకు పయనము సాగించెను.

సరకృష్ణాగఁడు కృష్ణు పితామహు నరింగుట

అదే దినమున ధనంజయుఁడును గోవిందుని చూడ వచ్చెను. ఆసమయమున శ్రీకృష్ణుఁడు పవళించియుండెను. కౌరవేశ్వరుఁడు తలయంపి వైపునున్న పీఠమున నలంకరించెను. సవ్యసాచి మ్రోలను గల్గడ గూర్చుండె జని వినమ్రుఁడై నిలిచెను. అంతఁ గృష్ణుఁడు మేల్కొని యర్జును నాలోకించి, తర్వాతఁ గౌరవాధిపుఁ గని, ప్రసన్న ముఖుఁడై యుద్ధర నాదరించెను. తదనంతరము వారలఁ జూచి కేశ

వుఁడు "వచ్చినకార్యముఁ జెప్పుఁడు" అని యడుగ దుర్యోధనుఁ డిట్లనియె :

"కయ్యముసేయు నాలోచనముతో సహాయమునకోరి భవత్సాన్నిధ్యమునకు వచ్చితిని. బాంధవమున కురుపాండవులు నీ కొక్క రూపు. ముందు నిన్నుఁ జూడవచ్చినవాఁడను నేను. సుజనులైనవారు ముందు వచ్చినవారికి సహాయపడుదురు. మరి సౌజన్యసా యుతుఁడవగు నీ వన్యథా చేయుదువే? కావున లోకంబు పాడి విచారించి నీవు నాకుఁ దోడు గావలయును."

అనిన దుర్యోధనునకు వాసుదేవుఁ డిట్లనియె :

"ఇక్కడకు నీవు ముందుగా వచ్చినది నిక్కమే; కాని నేను పార్థునిఁ దొలుతఁ జూచితిని. కావున మీ యిద్దఱకును సద్భావముతో దోడ్పా టొసగు టుచితము. దీనికిం [illegible]ంగుఁ దప్పక యుండున ట్లేర్పఱచెదను. నీవును సవ్యసాచియు మీ మీ యిష్టముల ననుసరించి కోరికొనుఁడు. నాతో పదివేవురు గోపాలురు గలరు. వారు సమర కోవిదులు; బాహాటోపాభిరాములు; చాపాద్యాయుధ కళావిశారదులు; నారాయణాభిధానులు. వారు యుద్ధముఁ జేయుదురు. ఇఁక నొక్కఁడ నే [illegible] బరిమాస్త్రుఁడనై నిరాయుధ వ్యాపారతమై నుండువాఁడను. వారొక తల, నేనొక తల; ఈ రెంటియం దెవ్వారి కేది ప్రియమో చెప్పుఁడు. [illegible] బాలకులు గోరికొనుట పాడి."

అని పలికి హరి కిరీటిం గని :

"నీవుఁ జిన్నవాఁడవు గాన ముందు గోరికొనుము."

అన విజయుఁడు కృష్ణుని గోరికొనెను.

ధార్తరాష్ట్రుఁడు దాని హర్షం బొంగి సైన్యములను తాను గైకొని బలరామ సదనమునకు సంతోషముగఁ బోయెను. అట్లు చని బలదేవునిఁ గని సమ్మానమునొంది తన వచ్చినకార్య మెఱిఁగించిన దుర్యోధనునకు బలదేవుఁ డిట్లనియెను :

"అభిమన్యు వివాహసమయమునఁ బ్రసంగవశమున గూడబడి యుండు నా సభాసమున నేను నీ పక్షము వాదించితిని. దానికి గొంత అసహ్యపడి పాండవ పక్షపాతకులుఁ బ్రతికూలాలు సంగములు పలికిన నది కృష్ణున కప్రియములై యుండెను. అట్లగుటచే నేను కృష్ణుని విడిచి యుండలేక నిష్క్రియుఁ జేసెను, పిరసపుపనాట ఉపేక్షించఁగయు, నేమియు ననక, ఒకని నిశ్చయముగా సహించియున్నవాఁడను. అది యేమంటివేని వినుము : నీయును పాండవులును యుద్ధమునకు దిగినచో నేనూరక యుండెదను. ఎవ్వరికిని దోడుపడను. ఇది నిశ్చయము."

అనిన విని దుర్యోధనుఁడు దానికియ్యకొని, సవినయముగా బలదేవుని వీడ్కొని, వాసుదేవసాహాయ్యగ్రహణముచేసి, కృతవర్మ పాలికిఁ జని, యాతఁడొసఁగు- యక్షౌహిణీతోడఁ దన్నుఁగలయవచ్చువాఁడని చెప్పఁబడెఁబలికిన బ్రియంబంది నిజపురమునకరిగెను,

తదనంతరము కృష్ణుఁడర్జునున కిట్లనియె :

“భూరిపరాక్రములగు నారాయణగోపాలురను దుర్యోధను నకు విడిచి యుద్ధముసేయని నన్నేలఁగోరికొంటివి ? ఇది నీకు మేలగునా ?”

దాని కర్జునుఁడు హరికిట్లనెను :

“నేను రణమున సహాయమొల్లను. సుప్రసిద్ధుఁడవగు నీవు యుద్ధముచేసిన నీకేపేరగును. నీకెదురై పుట్టినవారికి జయముగొనఁ సాధ్యముగాదు. అట్లగుటచే విజయమూలమగు నీతోఁడు నల యును. నీవు సమరము సేయకుండుటయు నాకుఁ బ్రియము. కావున నిన్నుఁ గోరికొంటిని.”

అనిచెప్పి యతఁడు నిట్లనెను :

“కృష్ణా ! నాకు సారథివై చిరకాల వాంఛితమగు నాకోర్కెను తీర్పుము.”

అనిన యర్జునునకు హరియిట్లనెను :

“పార్థా ! నీ కోర్కె తీర్చుటయె నాకు వ్రతము. యుద్ధమున నీకు సారథినగుదును.”

ఇట్లు కిరీటి నూరడించి, యతనినిఁ దోడ్కొని కార్యాలోచన మునకై హరి ధర్మతనూజు నొద్ద కరిగెను.

## 3

అంతట శల్యుపాలికిఁ బోయిన దూత లతనిఁ గాంచి సముచిత వచనముల నతని సహాయమునుఁ గోరి పిలిచిన, నతఁడు ప్రీతుఁడై పుత్త్ర మిత్త్ర సమేతముగా నానా సేనాపతిసంకుల ముగాఁ గదలి వచ్చుచున్న యెడల నిత్యప్రయాణ ములఁ జేయుచు సమీపమున నిడియుంటయు విని దుర్యోధ నుఁడు తన యమాత్యజనములను శల్యనాథుని మార్గమున కడ్డముగఁ బంపెను. తానుఁగూడ నిగూఢముగ నచటనుండెను. దుర్యోధనుఁడు పంచిన పరిజనులు శల్యసేనలకై నిర్మలోదకము గల నడబావులను త్రవ్వించి, సేనగులకును, గుఱ్ఱములకును గోష్ఠములను కట్టించి, యాత్రికసమూహములను, భక్ష్యములు, నేయి, పెరుగు, కూర గాయలు, వంటకట్టెలును, గడ్డి, గవణములు మున్నుగాగల సమస్త వస్తుసంచయములను నాయత్తపఱచిరి. ఇవ్విధముగ విడిదల పయనంపు సంపదలు వెంబడివెంటఁ దనకు సమకూర్చిన సమస్త వస్తువుల యనేక త్వమునకు శల్యుఁడు సంతుష్టాంతరంగుఁడై నిజపరిజనముఁ జూచి : “ ఇట్లు చతురముగా మనకు వలయువాని నాయత్తపఱచిన యుధిష్ఠి రామాత్యులెవ్వరు ? వారిఁ గొనిరండు. వారు ప్రసాదదానం బులకర్హులు” అనెను. అంతట మాఱువేషంబులఁ బనులు సేయుచున్న తన పరివారము వారిలోఁ గలసి మెలఁగుచున్న కౌరవేశ్వరుఁ డమాటలు విని, శల్యునికిఁ బొడసూప నిదియె సమయమని సముచిత ప్రకారమున మద్రేశ్వరునకుఁ దన్నెఱింగించుకొనెను. శల్యుఁడును

దుర్యోధనుఁడు శల్యసహాయముఁ గోరుట

సంభ్రమమునఁ గౌరవేశ్వరునిఁ గాఢాలింగన మొనర్చుకొని గనకాసన మునఁ గూర్చుండబెట్టి 'ఇంతయు నిమ్మహాత్ము నుద్యోగమున సహాయ్యఁ గావలయు' నని తలఁచి విస్మయమంది 'నీ కేయ్యది యిష్టమో కోరి కొనుము. ఇచ్చెదను' అనిన గాంధారీ తనయుఁడు పరమానందమునఁ బొంగి యిట్లనియె :

"సత్య సరస్వతి వగుము. నీ చిత్త మహాదిత్యవిశాలగగనము. నా కమాత్యుఁడవై నా సైన్యమును నడపుము. నీకు కురు సాంగస్ప్ర లోక్యరూప. ఐనను నన్ననుగ్రహించి నాకు మంత్రి సీగసము."

అన శల్యుఁడు దాని కియ్యకొని : "నా మనసునకు సిద్ధిగన్న త్రి లేదు. పాండవులును మీరును నా కొక్కరూప నీవు నన్ను ముందు చూచితివి. కాన నేను నిన్ను గూడెద. మహారాజ సహాయమునో కోరికొనుము."

అనఁ గురుపుంగవుఁ డెంతయుఁ బొంగి : "నీవు సమగ్రసైన్యము సేసి నా కిట్లమాత్యుఁడ వగుటకంటె నాకుఁ గోరవలసిన దేమి గలదు ?"

అనిన వికచవదనుఁ డగుచు మద్రేశ్వరుఁడు :

"నీవు హస్తినగరమునకుఁ జనుము. నేనుఁ బాండవులఁ జూచి వత్తును. వారిఁ జూడక తప్పదు. పోయివచ్చెదను" అనెను -

కౌరవేశ్వరుఁ డతనిని వీడుకొల్పుచు :

"అట్లయగుఁగాక. అటకుఁబోయి వేగముగ మరలుఁడు, వరము

"ధర్మజా! నీ గుణములనకు జగమంతయు నొచ్చినది. నీ నిష్ఠా దళల దురితములను గడచుటకు సమ్ముదము బొందెను."

అని యుచితసంభాషణములు సేసి, దుర్యోధనుఁడు దిన్న గాంచిన విధమును, నతఁడు ప్రార్థించి, తెలిపిసిరు, వానికి వానియ్య కొనుటయుఁ జెప్పిన ధర్మనందనుఁ డతని కిట్లనియె:

"మేలు సేసితిరి. ఒకరి మెచ్చి వారి కోరిక తీర్చుట పెద్దల గుణము కాదె? అది నాకు హర్షాస్పదమే. ఒన నొకటి వేడద నవధరింపుడు:

"పార్థునకుఁ గృష్ణుఁడు సారథ్యముఁ జేయువాఁడై యున్నాఁడు. కర్ణుఁడు పార్థుతో నెప్పుడు మచ్చరించుచు నుండును. వీరిరువురగు సంగ్రామమైన యగత్యము గృష్ణునకుఁ బ్రతి సారథ్యమొనరింప మీరు కాని యం దొకరుండు లేడు. కావున నవశ్యము మీరుఁ గర్ణసారథ్యము గర్తవ్యము. సమరసమయమున విరాళిరించి పలికి కర్ణుచిత్తమునకుఁ గలఁక పుట్టించి పార్థు రక్షింపవలయును. అశ్వత్థామ బని యనుమానింపక మత్ప్రార్థనమున సెల్లభంగుల నివ్విధ మనుష్ఠించ వలెను." అని యభ్యర్థించిన సమ్మతించి శల్యుఁ డిట్లనియె:

"అట్లే చేయుదును. 'కర్ణునకు రథముగడప నీవ తగుదువు' అని దుర్యోధనుఁ డనిన నే నతని ప్రార్థనము సలుపవలసివచ్చును - కర్ణుని సారథి నైనను నే నర్జునునిఁ గాచెదను - దుర్గతివిచారుఁ డగు కర్ణుని కఠోరములాడి కలఁతుసు. కర్ణుని తేజోదర్పములను చెఱచి,

దూలనాడుటను మఱవకుఁడ"ని హెచ్చరించెను. మఱి శ్రీహరి ధర్మజు నూరడించి, గాఢాలింగన మొనర్చుకొని, తన సమస్త బలముతో హస్తినాపురి కేగెను.

౫

రాయబారము

అట పాంచాలమహీవల్లభుఁడు పంపిన భూదేవుఁడు కరినగరమును జేరి, ధృతరాష్ట్రునిఁ గాంచి, కృప ద్రోణ విదుర గంగాసుతుల మందిరముల కేఁగి వారినిఁ జూచి, సముచితాలాపముల వారిఁ బ్రసన్నచిత్తులను జేసి, పదోర్థను సందర్శనమును నిర్వర్తించి, నిత్యనిపుణాలాపనమున ధృతరాష్ట్రు నభిముఖుని గావించుకొని యొక్కనాఁ డక్కౌరవేశ్వరుఁడు పేరోలగమున సమస్త సేనాపతులఁ గలయం గనుఁగొని యిట్లనియె:

"ధృతరాష్ట్ర పాండుభూపతులు సహోదరు లగుటయు, వారల యాత్మజులకుఁ దమతమ తండ్రుల ధనములు పంచుకొన భావ్య మగుటయు మీ కందఱకును సమ్మతమే కదా? అది యట్లుండఁ, తొల్లింటి విధమును మన కందఱకుఁ దెలిసినదే. ప్రాణగోష్ఠము లగు పనుల నిచ్చి వారిని చంపఁ దలఁచినను, పుణ్యంబు కలిమిఁ జేసి యా యుపాయములఁ దప్పించుకొని, పాండవులు తమ బాహుబలముచే నిజరాజ్యమును సంపాదించుకొనుటయు, తిరిగి వంచించి కౌరవులు వారి రాజ్యము నపహరించుటయు మీ రెఱుఁగుదురు కదా? దీని

కంతకును ధృతరాష్ట్రమహీపాలుఁ డియ్యకొను టెంత విచారకరము ?
సభలోని వారలు చూడఁగా ద్రౌపది నీడ్చి తెచ్చి చీర లూడ్చినను,
రాజ్యము నపహరించినను, నరణ్యముల నుండఁబంచినను, నేమి చేసి
ననుఁ బడియుండిన పాండవులతో సంధిచేసికొనుట యుచితముకాదా?
వీరి వృత్తమును, పాండుకుమారుల ప్రవర్తనమును, మాత్సర్యము
లేక యాలోచించి, మీరు ధృతరాష్ట్రభూపతి కేది యుచితమో
చెప్పుఁడు. అఖిల భూప్రజా నాశన మగుటఁ జేసి పాండవులు కౌరవుల
తోడి పగకు నొల్లరు. ఇంతమాత్రమున వారు బలహీనులని తలఁపఁ
వల్లదు. పాండవు లధిక ధర్మపరు లగుటచే నింతగా నాలోచించు
చున్నారు. వారికిని సహాయముగా నేడక్షౌహిణుల బలములు కూడి
నవి. కౌరవపక్షమునఁ గూడినవి పదునొకం డక్షౌహిణు లని తలఁతు
రేని వినుఁడు: బాహుబలక్షముఁ డగు భీముఁడును, సాహసరసికాత్ముఁ
డగు సాత్యకియు నాహవభూమిని సహస్రాక్షౌహిణులకును చాలుదు
రని మీ రెఱుఁగరే? అర్జునుని యస్త్రరంగమున మాన్యాసగోరుట
కొంచను పోర్లోలు బాగుగాఁ దెలిసినది. ఆ భీభత్సుని భూరిభుజా
బలమును, గాండీవ శౌర్యమును, శరవిద్యా బహుళతయును బంది
కొని బవరముఁ జేసినట్టి హరుఁడే మెచ్చుకొనును.

"అదియునుఁ గాక విదిగోపాయపరాయణుఁడును, రిపుదోర్గ
ర్వాపహారక క్రియాప్రవణోద్యోగుఁడును, మంత్రరక్షణ కళాప్రావీణ్య
గణ్యుఁడును, ధైర్య వివేకాది గుణోత్తరుఁడును, సకల విద్యాజాల
సంవేదియు నగు మాధవుఁ డండగా నుండ పాండవుల కసాధ్య

పెద్దదైన నుండునా? అందుచే నా మాట విని యుష్మత్పుత్త్రులఁ బిలువఁబంచి, హితమును ప్రియమును రెండు పక్షములకుఁ గలుగు నట్లు కొంత భూమి వారికిచ్చి కలిసి యుండుఁడు."

ఈ మాటలు విని భీష్ముఁ డిట్లనియె:

"పాండవు లాపదలను తరించి ప్రశాంతులై మనసుల నీసు దక్కి మృదు మార్గము నవలంబించుట యెంతటి భాగ్యము!

భీష్మ కర్ణుల వాగ్వాదము

భూసురోత్తమా! నీ వాక్యము విప్రస్వభావసిద్ధ శ్రుతికిఁ బరుషమైనను సభ కిష్టమైనది. కాని, నారు తప్పక, యశక్తులవలె పాండవులు నాఁడు సభలో బన్నముపడి చన్న దైన్యము, వనములబడ్డ విషాదవేదనాక్రమము, విరాటుపీట లఘుసంచరణమున దాఁగియున్న దుఃఖమును, జగ మెఱుఁగదె? అకల్మషులను బాధించుట పాడిగాదు. పిత్ర్యధనమగు పాలు పాండవుల కిచ్చి ధృతరాష్ట్రుఁడు వారిని నిజసుతులవలెఁ జూచుట భావ్యము. అవు గాదన నేరక, జూదమాడి, మాటతప్పిన ధర్మచ్యుత మగునని రాజ్యాపహరణమును సైత మోర్చుకొని ధర్మరాజు డాజ్ఞాపించిన సైరణ చేసెనుగాని, కవ్వడి కోపము నిగిడినచో నెట్టి మగవారైన నోర్వఁగలరె?"

అనిన విని కర్ణుఁడు గనలి యిట్లనియె:

"అంద రెఱిఁగిన దీనిని మాటిమాటి కుగ్గడింప నేల? సుయోధనునిపక్షమున శకుని జూదమాడి రాజ్యమును గెలిచెను. ధర్మజుఁ

జేసెను. అరణ్యములపాలై, శానివతనమును నిర్వర్తించి, తగునంచు తండ్రిపా లడుగుట తప్పుగాని యిందు సుయోధను తప్పేమి కలదు ? విరటుండును, ద్రుపదుండును తోడుగ యుద్ధమునకు వచ్చి విడిసి బలిమి నడిగిన సుయోధనుఁడు వెఱచి చక్కఁగా సగమురాజ్య మిచ్చునె ?”

అనిన గాంగేయుఁడు కటకటంబడి కర్ణున కిట్లనియె :

“కర్ణా! గొప్పశూరుఁడవులే! విన్నవారు నవ్వునట్లు పెద్ద మాట లాడెదవు! నిన్న మొన్న గదా యర్జునుఁడు మనల నార్వుర నొక్కఁడ గెల్చెను! నేఁ డిక్కడ రాజసభలో నతనిని మాటలతోఁ గెల్చెదవు. నరుఁ డాలవెనుక వచ్చినప్పుడు కురురా జడుగగా నీవును గురుఁడును కృపాశ్వత్థామలును వినునట్లు పాండవుల యజ్ఞాత వాస దీక్షాకాలము గడచెనని నేను చెప్పలేదా ?”

అనిన ధృతరాష్ట్రుఁడు పాపగాతనయుని భక్తి ననునయించి, రాధేయుని గినిసి, బ్రాహ్మణుఁడగు ద్రుపదు పురోహితున కిట్లనియె :

“నేను బంధువులను, మంత్రులను, పెద్దలను మంచిగ విచారించి, ప్రజలకుఁ బ్రీతియగునట్లుగ పిల్లలపాలికి సౌమ్యమైన నొక్కనిఁ బుత్తెంచె దను. కౌరవ పాండవులు గలిసి బ్రదుకుటకు సమ్మ

ధృతరాష్ట్రుఁడు దూతను వీడ్కొల్పుట

తించుటయే కౌరవజాతి కెంతయు మేలు. నీవు ముం దేగుము.” అని యతనికి విభూషణాంబరము లతోఁ గమ్ములంబు బెట్టి పీఠకో లిచ్చి పుచ్చగా విప్రవరుఁడు పాండవేయుల కడ కేఁగెను.

ధృతరాష్ట్రుఁడు పుత్త్ర మిత్త్ర వృద్ధామాత్య సహితముగా నాస్థానాసీనుఁడయి యుండి సంజయుని రావించి యతని కిట్లనెను:

"పాండవు లుపప్లావ్యమునకు వచ్చి యున్నారు. నీ వేగి వాసుదేవసహితముగ వారిని సందర్శించి, విపాదకరమగు యుద్ధమును మానునట్లు పలుకుము."

"మీ యయ్య మీరు వనవాసాయాసమును నిస్తరించి యాభ్యుదయమున నున్నారని విని ముదితాత్ముఁడై యిట నన్ను బుత్తెంచెను." అని మొదలనుము.

అని సభాసదులఁ జూచి

"దుర్యోధనుఁడు శార్యాశార్యజ్ఞుఁడు గాక బేఁపుచే నిట్లెఁతక గలిగెఁగాక, ధృతధైర్యులును రణధుర్యులును నగు పాండవులు దోసాన్వితులే? మనమును వారును శ్రీగోదకములవలె కలసి యుండవలదె? వా రిడుమల బడఁ దగువారే? పిత్ర్యభాగ మేలుకొనుటయు గాఁరే? మనల నన్నతాత్ములనియు, నన్యాయపరులనియు, గర్వులనియు నెంచి పాండవు లింక మనల నమ్మరు. మనతోఁ గూడి మనుట కియ్యకొనరేరు. ఐనను దగవునడపుటకు ధర్మజుఁడు గలఁడు. రాజ్య మీయకుండుట మనకు సాధ్యమా ? మనము దుర్మానము వాటించి వారికిఁ బా లీయక గర్వించిన కృష్ణుఁడు సారథియై రథము నడపఁగాఁ నిక్కమగు నల్ల నర్జునుఁడు గాండీవము మోపెట్ట జగత్త్రితయ సంక్షోభము గాదే? అలఘుగదఁ బూని భీముఁ డతిరయమునఁ గౌరవుల పైఁ

సకుఁ దనరాక నెఱిఁగించి పుచ్చి, యభ్యంతరముఁ బ్రవేశించి, భయ
భక్తి వినయసంభ్రమములు మెఱయ వారలఁ గాంచి,
యమ్మహాత్ము లిరువుర సంభావనములును సంభాష
ణములునుఁ బడసి సంప్రీతచేతస్కుఁడయ్యెను. మఱు
నాఁడు ధర్మతనయుఁడు పేరోలగమున్న సమయము వేచి, సముచిత
ముగా నతనిం గని సాష్టాంగముగాఁ బ్రణమిల్లిన నతఁడును ప్రియ
పూర్వకముగా నాదరించి సమీపమునఁ గూర్చుండబంచెను. ఇట్లు
సముచితాసనాసీనుఁడై సంజయుఁడు ధర్మజు నుద్దేశించి యిట్లనియె:

సంజయ రాయబారము

"భాగ్యమునఁ నిన్నుఁ గనుఁగొనబడసి నాకన్నులు చరితార్థము
లయ్యెను. మీతండ్రి ధృతరాష్ట్రజనపతి యిందు మీ యునికను విని
మీ యందరి యోగక్షేమములఁ గనుఁగొన నన్ను నితాంతస్నేహ
పూర్ణమైన చిత్తముతో మీకడకుఁ బుత్తెంచెను."

అనిన సంజయునకు ధర్మనందనుఁ డిట్లనియె:

"ధృతరాష్ట్రజనపతికి మాయందలి దయవలన మేము సుఖముగ
నిట్లున్నాము. గారవమున నిన్నుఁ బంపుటకు సంతుష్టాంతరంగుఁడ
నైతిని. అమ్మనుజేశ్వరునకు క్షేమమే కదా? కౌరవులు సుఖముగ
నున్నారా? మనుమలు సమ్మోదమున వర్తిల్లుచున్నారా? దేశమున
శుభసంపద లలరారుచున్నవా? భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు కుశ
లముగ నున్నారా? కౌరవులు భీష్మునకుఁ బెద్దతన మిచ్చి మెలఁగు

జాలఁడాయెను. పిదప మనఃక్షతి పుట్టి యిప్పుడు శాంతుఁడయ్యెను. నీ యజాతశత్రుత్వము నిఖిలలోక విస్తృతము. అందుచే నీవు పుణ్యకీర్తి వృత్తిమై వీనినెల్ల సైఁచదగును. మహీసురులు జగమునఁగల ధనము లను హరించుటకై పరమేష్ఠి నిర్మించె వెలుఁగును. శ్రోత్రియులకు పరిత్యక్తము దత్తములైన మడిమాన్యముల నెంతటి కుమతులైనను లాగికొందురా?"

" 'పాండుకుమారులు దుర్వారబలులయ్యు నాగ్రహించి ధర్మమునకుఁ బూనరు. వారు శాంతాత్ములు' అని జనులు పొగడుచుందురు. అది యట్లుండె. ధర్మజా! భవదనుజులును, నాప్తులును, శ్రీకృష్ణుఁడును వినుచుండ నీకు విన్నవింపవలసిన పలుకులు గల వినిపింతును."

అన ధర్మనందనుఁడు: "వారే తమ్ములును, కృష్ణుఁడును; వీరే యాప్తులు. నిన్నేమనుమని పంచె నది యంతయుఁ జెప్పుము." అనిన సంజయుఁడును ధర్మనందను గరువంపుఁబలుకుల విస్మయముఁడై పది నలుకుచు కృష్ణుని సద్భక్తి నీక్షించి భీమార్జున నకులసహదేవ ద్రుపద నందనుల సవినయమునఁ గనుఁగొని, పాంచాలుని విరటుని ప్రీతిం జూచి "సావధానులై వినుఁడ"ని పలికి యుధిష్ఠిరు దెసకు మోడ్పుఁ గేలు నిగిడించి యిట్లనియె:

"శాంతిఁ బొంది కార్యమంను ధృతరాష్ట్రమహీశుఁ డాత్మ నిశ్చయబుద్ధి గలవాఁడై ప్రీతితో నన్నియ్యెడకుఁ బంచునప్పుడు నాకు రథము స్వయముగఁ బన్ని నానతిచ్చెను. ఈవిధ ముగ సంధికై యాతఁ డాతురుఁడై యున్నాఁడు. ఇట్టి సమయమున మనము లాభముఁ బొందవలెను. సర్వధర్మ

సంజయ వాక్యములు

జ్ఞాలనియు, శాంతులనియుఁ బ్రసిద్ధులైన మీవంటి పెద్దల కిట్టి కార్యముఁ జాలకన చేయదగునే? మనుఁగు జీరయందు మసి చాఁకినట్లు సత్కులమున దుర్యోధనుని కతనఁ గల్మషముగలిగెను. దీని నంతటను క్షాళిత మొనర్ప నీవ నేర్తువు. అఖిలజనప్రియుఁడవై జయమైనను నపజయమైనను తుగిని సుఖముగాని యీ పనికి నుత్తము లియ్యకొందురే? బాలవృద్ధులను, గురువులను, బంధుమిత్రులను జంపినవచ్చు నీ నిఖిల సుఖములు నేమిటికి?"

"హరి నీకు పెట్టనికోట. భీమార్జునులు యుద్ధమున కార్చిచ్చుల వంటివారు. ఇంక సాత్యకియును విరాటుఁడును సామాన్య యోధులా? ద్రుపదుఁడును గొప్ప గణ్యుఁడు. యుద్ధమునను నీ పిల్లలుగాని సురలైనను నిల్చి నిల్వఁగలరా? మఱి యక్కడనో భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలును, గర్ణ శల్యులును సుయోధనుని ప్రాణములవంటివారు. నిరనుజన్ములు యాత్మ్రణపరాక్రములు; సుతు లందరును; శాస్త్రాస్త్రనిపుణులు స్థాణువులైన నోడరు. వారిని జయించ నెవ్వరి తరము? ఇట్టి మీ యిరుపక్షములకును కలహము నాకు సమ్మతము కాదు. రెండు పక్షములకుఁ బ్రియమును హితమును గోరువారు పడిగి చూడుము."

అని పలికి సూతనందనుఁడు గొలువు గలయఁ జూచి:

"వాసుదేవునకు బ్రణామము; సవ్యసాచికిఁ జేతులుమోడ్చెదను; తక్కటి మిత్ర బాంధవ హిత ప్రియ మంత్రి వయస్యకోటికి

స్రుక్కుచు విన్నవించెదను. అనసూయులు దక్షిణా యనుగ్రహేయులయ్యు క్రోధశాంతి కిట్టి-రులకు శరణు వేడెదను."

అనుచుఁ బ్రణామపూర్వకముగఁ బాండవాగ్రజు పదములఁ జూడ్కి నిలిపి :

"దేవా! ఉపశమించుట లెస్స. ఇక్ష్వాకుఁ గురుపితామహుఁడును సంతసిల్లు. అతని కనుమతంబైన పోరుగు సర్వలోక సమ్మతమగును."

అన విని ధర్మనందనుఁ డిట్లనియె.

"సంజయా! నాపల్కులఁ దియ్యకి నెయ్యపుఁగిప్పు సౌంపంచకేని, నీ చెవి సోఁకెనె? యుద్ధము లేక మనుట మా కుచితము గాదా? రణము లేక గలిగెడు భాగ్యసిద్ధి నొల్లక యెంతటి పెద్ద నను మఱియొక ప్రయత్నము సేయునే? భీమార్జునులు దుష్కర్మములకు సిద్ధపడుదురా? ఒప్పని తృష్ణంబడి

ధర్మరాజు వచనములు

కొందఱు జనులు మనస్సున సుఖముఁ గోరి దుఃఖదాయకములగు కార్యములకు నుత్సాహము జూపుదురు. తృష్ణయు నెంతటి బెడిదంబులకు నైన సొత్తురు. పోరాటములు సంతాపకారకములుగాక సుఖప్రదములే? భోగములు వలదా యని తలఁతుమేని వస్త్రమాల్యానులేపనములకును, చతుర తూర్యత్రయములకును, మేము దూరముగ నుండ, మా తండ్రియగు ధృతరాష్ట్రభూపతి యెట్లు రుచించును? నిజ పుత్త్రుల నాదరించి మమ్మేల వెడలగొట్టును? ఐనను నొక మాటఁ జెప్పెదను. సమగ్రచిత్తుఁడవై వినుము.

"భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలును గణ్యింపను మనుష్యులగుచు తెలియఁగరా ? ఆశాపాశములు చుట్టుకొని రాగా యుద్ధములు తప్పునా ? ఎదిరిబల మెఱింగియుఁ జావఁగోరి మోహరింతుము. ఇంత కన్న జరుగునది లేదు. కపిధ్వజప్రభలు ధార్తరాష్ట్రుల సంధీభూతులఁ జేయవే?"

"ముందు మమ్మున్ బొగిడి, పిదప యుద్ధమున ధార్తరాష్ట్రుల గెలువ నసాధ్యమని నీవు చెప్పినమాటకు నే నొప్పఁబడను. సంజయా! పక్షపాతము మానుము. గాండీవజ్యారవ మత్యుత్కటమయి తీవ్రముగఁ గ్రమ్మినప్పుడును, భీము బాహాదండ మేపారి శుంభద్గద జళిపించు రౌద్రముగా దోఁచినప్పుడును, వేదండద్వంద్వము మూఁడ్కాళ్ళ నేల తాకినప్పుడును, కౌరవులకుఁ జావకుండ బోవవశమే ? కాన్పున రణమునఁ కౌరవులను గెలువరాదనుపలుకు లటుండనిమ్ము. సద్గుణుఁడవగు నీవు వచ్చితివి. ప్రకోపశమముగఁ బల్కితివి. మున్ను పరాభవ మొనరించియు వారి దుర్గుణములు సైఁచుట నీ వెఱుగనిదే ? ఇంకను సహింపఁ గలము. మే మొకరికిఁ గీడుసేయ నొల్లము. దానికి సందియము వలదు. అయ్యకు విచారము గల్గెనేని బాంధవము మరల నెల కొల్పునట్లు, మేము మఱియొక మార్గము ననుసరింపక మున్నె, రండని బిలువఁబంచి, పాలిండని కొడుకులకుఁ జెప్పి, యింద్రప్రస్థమో మఱియొక పట్టణమో మాకిచ్చి పుచ్చుట యుచితము."

ధర్మజు మాటలు విని సంజయుఁ డిట్లనియె :

"ధర్మజా! నీ విభవమును, నహింసయు, నీయనింద్యచరిత్ర

మును జూచుచున్నవి. మీ పాలియ్యక కౌరవులు దాక్షిణ్యతఁ జెడఁ దలఁచి రేని రుధిరాభీలాన్నముకంటె భిక్షాన్నమైనను మీ నడవడికి మేలని నా మతము. రాజసూయ మహాధ్వరమునఁ బూర్ణాహుతులను సురలను సంతృప్తి పరచి శాంతికిని దాంతికిని సకలలోకముల చేతనుఁ బొగడఁ బడిన పుణ్యమూర్తివి నీవు. ధర్మనిరతుండవు హింసాకళంకితమగు చింతయు నుచితము గాదు. అదియుఁగాక స్వజనవధ దుష్కృత్యము పుట్టించి యింత చేసినట్టివారి గర్వముఁ బెల్లుసిద్ధి, యాయుధముల నిశితములఁ గుఱిచేటయు నీ యనంతశాస్త్రజ్ఞత్వము కతనసే కదా? ఇంత చేసి తుదకుఁ గ్రూర కార్పణ్యదమగు మార్గము నవలంబించి యస్థిరమగు సౌఖ్యము నాసించి బంధు గురులను వధించుట యార్యనింద్యము కాదె? 'హాలాహలము' వలెఁ బొంగిన కోపమును మ్రింగుటలో నీవు నీలగళుని కెనయైన వాఁడవు. అబ్బల కది చేఁత యగుఁగాక. అట్టి నీవు గాక మఱెవ్వ రోపుదురు ?"

సంగ్రామ ప్రవృత్తి

అని ధర్మనందనుఁడు సంజయుమోముఁ జూచి యిట్లనియె :

"నీవు పలికినది నిజము. కాని యొకొక్కయెడ కొన్ని కర్మములు ధర్మములట్లు యుండి, బోధకు లరయవచ్చినప్పు డధర్మములగును. కొన్ని యధర్మ గాక యనర్థవర్తనములుగ తోఁచియుఁ గూడిని ధర్మములై పరిణమించును. కావున నన్ను దూఱఁదలఁచితేని నా చేయునది ధర్మమో యధర్మమో నిరూపించి మఱి దూఱుము. కోపమును నివారించుట భావ్యమే. అహింసయు నుత్తమధర్మమే. అట్లయినను వంశదూషకులును

ధర్మాధర్మ వాక్యములు

లోకకంటకులగు పాపాత్ములను నిర్మూలముగా ఖండింపఁజేయుట ధర్మ
మని పెద్దలు చెప్ప విందుము. అది యట్లుండనిమ్ము. సంగ్రామము రాజు
లకు ధర్మమగునో కాదో నీవ చెప్పవలెను. అగియుఁగాక యుద్ధ కర్త
వ్యము, ఇది యకర్తవ్యమని నాసల బోధించి నాకుఁ దెల్పఁ గలదయ్యెఁ.
మన కీ వితర్కమేటికి? ఇతఁడు ధర్మాధర్మవివేకులకు గురుఁడు; కార్యా
కార్య నిరూపకులకు శిక్షకుఁడు, ఉచితానుచితములకుఁ బ్రదర్శకుఁడు.
ఇతని పంపునఁగాదె యాదవభోజాంధక వృష్ణి సృంజయ కేకయ ప్రభృతి
భూపతి ప్రకరము ప్రశస్తపథమునఁ బ్రవర్తిల్లుచున్నది. విశేషించి
మాకు నితని బుద్ధియ సమస్త పురుషార్థములకు మూలమగుట నితని
వచన మవశ్య మలంఘనీయము."

అనిన విని జనార్దనుఁడు సంజయున కిట్లనియె.

"నేను పాండవుల మేలునే కోరుదును. పుత్రస్నేహమహామో
హ్యులుఁడగు నాంబికేయుఁడును మంచిచెడుగులను గ్రహింపనివాఁడు.
అందుచేత నే పాండవులఁ జేర్పఁగా నతఁడు నిండుమనమున
నిన్నుఁ బంపెను. దీనికి నేనుఁ బ్రీతినొందితిని. నీవును
నుచితమగునట్లు సెయ్యమును, ధర్మమును, వినయమును
గనఁబరచి పాండవులు శాంతినొందునట్లు పల్కుటయు నాకు సంతసముఁ
గల్గించెను. ఇది యంతయు చాల పొందుపడినట్లుండినను ధర్మరాజుని
పలుకుల చందముఁ జూడ సంధి కుదరనట్లే కాన్పించుచున్నది. అది
యట్లుండనిమ్ము. సంధి యెట్లు కల్గును? దుర్యోధనుఁ డట్లు నమోదించినను
నున్నాఁడే కదా? ఇంక ధృతరాష్ట్రభూపతి హృదయముగూడ నున్న

శ్రీకృష్ణ వచనములు

మెఱిఁగినటే. ఆ రాజు నేయు నెయ్యము మిక్కిలి తీపిగ నీవు చెప్పి దవు. కాని పాండవులు వధు పాలు పడయకుండ నేర్పరితనపు మాట లరు తేరనేసెదరే? నీవే చెప్పుము. పాండవులు వెనుకటి విషయములం దెంచక, గోడదో గనుక విషము, లాక్కబాపి, తేటి, శాంతులై కౌరవ కోటిని గూడి మనఁగోరుట నిన్ను నెక్కువ తాల్మియుఁ గారుణికత్వ మును నేమికలదు? న్యాయపద్ధతిని తింపి పాలియ్యరని తెంపుజేసి యుద్ధసన్నద్ధులగుట ద్రోహమా? సంజయా! వినుము. అవమాన పడియుండి పొంగి పొగిస్కరించి పరాక్రమముతో యుద్ధమునకు గిగులుటయు లెస్స. ఎట్లు చూచినను పాండవులకు యుద్ధమే మేలని నా మతము."

'సంగ్రామము రాజులకు ధర్మమగునో కాదో నీవే చెప్పుము.' అని యుధిష్ఠిరుఁడు బిగ్గఁడి గెనుగిడా! ద్విజాతులకు యాచన యాజ నాది కర్మకరణపుభాగము ధర్మశాస్త్రాచార్యులు విధించినప్పుడు రాజు లిచ్చువారుగాని, వేఁడుకొనువారు గారని చెప్పట సకల లోక ప్రసిద్ధము. సకల వర్ణాశ్రమధర్మ పరిపాలనము సేయునట్టి రాజులు తామే బిక్షాదర్శకులను వదలుదురా? అదియునుఁ గాక పాపిటోడి యాచ్ఞనమును దమకు గల సిరిని యనుభవించుచు సత్పథ మును వడిచినఁగలం గి మెగ్గిగు లన్యాయము సేసియప్ప దుపహో గించుటయు గదా యీ శ్రీస్త్రధర్మము లింద్రాదులగు పెద్దలు గావించిరి? నీ చెప్పెడి ధర్మములు గొరవులకుఁ జెప్పవలదా?

వారలు గదా వెనుక ముందు లరయక పసుపసులకుఁ దిగి చెడు తెరువులకుఁ బోయిరి.”

అని పలికి మఱియు నిట్లనియె:

“నాడు సభలో నెవ్వరి కష్టముఁ గలుగునట్లై ద్రౌపది నవమానించుట తగుకార్యమే? లోకమున జూదమాడరా యేమి?”

అనవుడు సంజయుఁడు: “దేవా! దీని నింతగాఁ జెప్పిన సంధి కార్య మెడగూడునే?”

అనిన వాసుదేవుఁ డిట్లనియె:

“ఆ సమయమున భీష్మముఖ్యులగు వచ్చిన వృద్ధజనులెల్ల ధృతరాష్ట్రుని యభిప్రాయము నెఱుఁగనివారై నోరెత్తక యూరకుండిరి. ఆ ధృతరాష్ట్రుఁడేని యాఁ గొడుకుల దండించి యిట్టి కార్యము వలదని చెప్పఁ డయ్యెను. అట్లు కొడుకుల నాతఁడు వారించియుండెనేని నా చిత్తము కాదు లోకు లెల్లరును సంతసించియుండరే? దుశ్శాసనుఁడు తిట్టుచుఁ బోయి ద్రౌపదిని దలవెండ్రుకలు పట్టుకొని పెద్ద లుండు సభకీడ్వఁగా మామయై ధృతరాష్ట్రుఁడే యట్లు సహించెను? ద్రౌపదియేమప్పు డెలుఁగున కెట్టు లోర్చెను? ఇవి యన్నియు మఱచి యిప్పుడు నీరి సేయ మూరయుటకై యెట్లు పనిచెను? ఈయకార్యము తగదని సభ్యు లందఱును నష్టపడక యూరకుండఁగా ద్రౌపది స్వసంరక్షణము చేసికొనఁగలిగిన దగుటచేఁ బాండవులు బ్రతికిరి గాని యయ్యాపదు కాచ కుమారుల కోర్చునట్టిదే?”

సంజయా! అప్పుడు సభాసదులఁ గర్ణశూలము లగునట్లుగాఁ గర్ణుని పలుకులు వినవే:

"నీ కిచట మగలు లేరు. వారలు జూదమున నిన్నోడి విడిచిరి. నీపైఁ గూరిమి గల మగని నొరు నెవనినైన వెదకికొనుము.' ఈ పలుకులు నరునకు వాఙ్మయమగు శరమై హృదయమున నాటి పలింపక దుర్భరవేదనఁ గల్గింపగా నింత కాలమువఱకు నేదైన చికిత్స చేసె నేమో నీవే చెప్పుము?"

ఇంతియు కాదు. దుశ్శాసనుఁడు 'వీర లందఱు గొడ్డుపోయిన వారలు. పౌరుషము గల మానిసి యొకఁ డెవ్వఁడు?' అనియె. అతఁడు చెప్పినట్లు వీరలు గొడ్డుపోయిరిగాని వీరి వలనఁ గౌరవుల కేమి కీడు వాటిల్లెను? మఱియుఁ దత్సమయమునఁ బుట్టిన మాట లుగ్గడింపఁ దగినవి గావు. ఇట్టి పరిస్థితులలో సంధికార్య మత్యంతము దుర్ఘటము. దీని ఘటియింపఁజేయ నవశ్యంబని తలంచెదను. ఐనను పాండవుల నెల్లని వేఁడికొని నేనే యిచ్చటికి వచ్చి కౌరవులకు బుద్ధిచెప్పెదను. నామాట విని రాజ్యము పంచుకొనినచో వారు మృత్యుపాశమును దప్పించుకొందురు. అటుపై న్యాయమును నీతియు నడుపుట నాకుఁ దప్పుకాదు గదా! అన్యాయము కాని నా మాటను వారు మన్నించిన మన్నింతురు. అట్లు గాక యుపేక్షించినచోఁ బాండవబాణాగ్నిని గాదు తమ లోభమను చిచ్చుననే సలింతురు."

అని పలికి శ్రీకృష్ణుఁడు మఱియు నిట్లనియె:

"సుయోధనుఁడు క్రోధమయ మహాతరువు! అంగరాజు కర్ణుఁడు స్కంధము. సౌబలుఁడు గొమ్మ. దుశ్శాసనుఁడు కుసుమ ఫలము. మూలశక్తి తండ్రి. ధర్మజుఁడు ధర్మతరువు. అర్జునుఁడు ఘనస్కంధము. అనిలసుతుఁడు శాఖ. కవలు పుష్పఫలములు. నేనును భూసురులును, వేదములును, తదీయమైన మూలచయము. ఈ రెంటి యందును నరసి 'యిది యసారము; ఇది గాఢ సారసహితము' అని తెలిసికొనవలయును. ఏది యెట్లున్నను నిర్వ్యాచేల? ధృతరాష్ట్రుఁడును వాని పుత్త్రులును వనము వంటివారు. కుంతీనందనులు సింహములు. అసహ్యమైన వనమును ఛేదించుట లోకసామాన్యముగదా? కాని వనావృత వృత్తములు కాని సింహములకు వేగము కీడొదవును. అట్లు గావున పరస్పరము సఖ్యభావము యుభయులకును క్షేమకరము. పాండవులు ధృతరాష్ట్రునకు సేవకులై యతని శత్రువులకు గర్వయుతులై యుండుదురు. అట్టి వీరిని తన కొడుకులను వలె జూచుకొనరాదా? నే నీ పనికై హస్తిపురమునకు వచ్చెదను. ధృతరాష్ట్రుఁడు సంధికొప్పిన మేలు. అట్లుగాక వేఱువిధముగా జేయఁదలఁచినచో మేము చేతనయిన కొలఁది చేయువారము. ఈ మాట కౌరవపతికిఁ దెల్పుము"

అనిన విని సంజయుఁడు ధర్మతనయునిఁ గనుఁగొని:

"అట్లయినను గడు లెస్సగదా? దేవా! నా వచ్చినకార్యము సఫలమయ్యెను. పోయివచ్చెదను."

అని వాసుదేవున కిట్లు విన్నవించి భీమార్జున నకుల సహదేవ సాత్యకి విరాట ద్రుపదుల వీక్షించి "మీ యందఱచేత ననుజ్ఞాతుఁడ

గదా? పోయివచ్చెదను. నా యాడినమాటలయం దేమియుఁ దగని యట్టివి లేవుగదా?"

అనుటయుఁ బాండవాగ్రజుఁ డతని కిట్లనియె:

"సంజయా! నీవు సహోన్నతుఁడవు. ఎదుటివారి యున్న రూపును నిర్భయముగఁ బల్కితివి. దుర్ణయమును, బెట్టిదమును గెంపును నగు పలుకు నీకు రాదు. ఇట్టికార్యములకు నీవో విదురుఁడో చాలుదురు గాని యింత వినయమును నేర్పును గలవా రింకెవ్వరున్నారు?

ధర్మరాజు వీడ్కోలు వాక్యములు

"నీవు హస్తిపురమున కేగినప్పుడు పెద్దలగు విప్రులనెల్ల గాంచి, యాదరమున వారి సేమ మరసి పిదప నాకుఁ గూర్చు నాప్తైన భీష్మ ద్రోణ కృపులకు నా నమస్కారము గాఁగ నధిక ప్రియభక్తి నమస్కరింపుము. మా తండ్రిని గని దండప్రణామము నాచరించితి ననుము. సుయోధనుని సేమ మడిగితినని చెప్పుము. అతని తమ్ముఁ డగుటకు దగు దుశ్శాసనుని సేమ మారయుము. తక్కిన కుమారవర్గమును వనితాజనమును నుచితముగ సుఖ మడుగుము. వికర్ణుని శల్యుని గాంచి వినయము దోఁపఁగ నాడుము. ద్రోణ తనయు నక్కఱ నస్సేర్చి కొంటిననుము. బాహ్లీకుని సోమదత్తుని భూరిశ్రవసుని దలఁచి ప్రియము నారయుము. సుజాతియు వంశవంతులు, వయోవృద్ధులు నగు భూపతులను, కృతవర్మను, గర్గ శకుని సైంధవ ప్రభృతులనుఁ దక్కిన రాజలోకమునుఁ, గయ్యమునకుఁ దోడువచ్చిన సకల దేశాధీశులనుఁ గని యెవ్వరితోడ నెవ్విధమున బలుకఁదగునో యట్లు

ప్రకారములఁ బ్రణామ వినయ బాంధవ మైత్రీ వాత్సల్యములను మద్వచనములుగాఁ బలికి యుచితంబుసేయి నుపచరింపుము. గాంగే దాసజనముల కుదాసీనముగాకుండఁ ద్వరలో మిత్రసంగమున శీఘ్ర నిరాసమొనర్చి తమ్ముఁ బరసేదననుము. హస్తినాపురము కేగిన వెంటనే నీ వంకఁ జేయవలసిన దంతయుఁ జెప్పితిని. దీనిపిదప మా [illegible] కొలువుతీర్చియున్న సమయమున వారోడక యిట్లనుము:

"అనఘా! భవద్బలంబునన యాపద యించుకయు లేక పాండునందనులు నిజాప్తబంధుసహితముగ సుఖముగ నున్నారు. శైశవంబునన వారి జనకుని రాజ్యపీఠమున సమ్మదమొనగ నిల్పి ప్రభుత్వ మిచ్చి తగఁ బ్రోచితివి. అట్టి నీ విప్పు డుపేక్షఁ జేసి స్వస్థయుఁ డవై పాండవులు దారిద్ర్యము ననుభవించుచుండఁ జూచుట తగునా? ఇంతనే సంతసింపకుము. రాజ్యతృష్ణ కంతము కలదా? పసవ విరో ధుల గర్వ మడఁగునట్లు కూడి మనుట గొప్పదా?"

అని తదవసరమునఁ బితామహునితోఁ నిట్లనుము:

"శంతనుని యన్వయ మడఁగకుండ నీవ కాపాడితివి. ఇప్పుడును కూడ నీ యిష్టముచొప్పుననే పెంపొందఁగూర్చి పౌత్రులను సకికిని, సధర్మప్రవృత్తికిని, జావునకును బాలుగాకుండ కాపాడినచో సను స్వజన ములును, ప్రభువులును, భూసురులును నిన్నుఁ బ్రస్తుతింపరే?"

అని వెండియు

"ఇంతయైనను శాంతిపరుఁడై ధర్మజుఁ డాలము పొంతనైనను బోనొల్లఁ డ"నుము.

ఆ సమయమున నచ్చటివారెల్ల వినునట్లుగా సుయోధనునితో నిట్లనుము :

"బాహుబలాఢ్యుల బలవిహీనుల క్రియ కావలసడిచిన వెట్టితనమునుం, జరకాల మడవులను గొంపలను బాధలం బెట్టిన పరుషదనమును, సభలోన నట్లు పాంచాలిసిం దలపట్టి యీడ్చిన తులువతనమును ధర్మపుత్త్రుండు సైరించెను. ఇది తథ్యము. ఇంకం గురుకుమారులను యుద్ధమున బ్రుంగిగొనుటకుం దలంచుము. ఒరుల సొమ్మునకాసపడం దగదు. వారిపాలు వారికిచ్చి వారితోంగూడి బ్రదుకుము."

"నేను కలనం గొల్లలకి పొంగ గోరుట తనకు మేలు. తన మనమున నిటలోను త్రిప్పనాల నూర్పు నోరు లడ్డము లాశపోస్సుటచే నేన ముగ్గు చెప్పవలసివచ్చెను. తన యుద్ధం గల యోధసేన తమ్ముడలను లేక పోవుట ఎల్లంబయినను, కారుడుం డగోడు ధర్మము గలదు. అదియునుం గాక యాగములలోన సేవితుండైన కృష్ణుండు మాకుం జెనుంబ్రాపు గావునం మముగ్గ గెలువ నారికసాధ్యము. అది యట్లుండె. నేను భీమసేనాదులకునుం దమునునుం బెద్దవాండ నగుట, వీరును వారును మదీయ ప్రార్థనాభంగముం జేయక నాదగు శాంతియు, దాంతియుం బోగించి, సన్నులబడిదెట్టక, పోరిత ముడిగి తమతమ ధనములు గుడిచి సుఖముండెడి పసన ప్రవలయును, దక్షిణ బుద్ధిమంతులకును సంతోషమగును. ఎనుక పగ లేయ నోపం జేని కుశస్థలమును, వృకస్థలమును, వారణావతమును బాలునను. కాదేని మఱియు నెందేనియు నొక్కటి యగునట్లుగాం దన తోడంబుట్టువు

లేవురకు నిలువ శాంత్రు లయిదిచ్చిన సర్వ శాంతియగును. అట్లగున నిందలి యందలి బంధు మిత్ర సహాయజనములు గలసి, సస్పృహుఁ దెగడుచు నుండుట యందరకును బ్రియము సేయును. కురు పాంచాల యాదవ మాత్స్యులు పరస్పర ప్రీతిసూనాధికత్వ సంపన్నులై బ్రతుకుట నా కోరిక. ఇంతయు నమ్మహాపురుషునకుఁ దెలియఁజెప్పుము."

అనిన విని

"దేవా! నీ యానతిచ్చిన మార్గ మంతయు నడపెద. మీ తండ్రికిని నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియమో యట్ల చేయువాఁడను." అనుచు బ్రణామము జేసిన సంజయునకు ధనంజయుఁ డిట్లనియె.

"బాల సఖుఁడవు. నీ లెస్సదనము నాకును, మేము నీతివిడచి దుశ్శీలురమగుట నీకును శైశవమాది తెలియదే?

"సంజయా! బలమత్తాకృతియైన భీముఁడను శుంభత్కుంభి సంరంభమును ధర్మజుఁడు నాఁడును నంకుశమై నిలిపెను. తుగిని నేఁడును దదుద్రేకము నణఁచుటకు నజాతశత్రుని కృపామాధుర్య ముండగా వారికి నయవిక్రమోచిత విచారక్లేశమేల?"

అని పలికి ధర్మతనయుఁడు తన యనుమతమున సంజయునకు సపరివారముగా సముచితప్రకారమున మజ్జన భోజనము లొనరింపించి, మాల్యానులేపనా ద్యుపచారములు చేయించి మణిభూషణ చిత్రాంబరము లొసంగి వీడుకొల్పిన నతఁడును బాండవులను వాసుదేవుని వీడ్కొని చనియెను.

# రా య బా ర ము

## ద్వి తీ యా శ్వా స ము

ఇవ్విధమున సేనాని సూతనందనుండగు పవనజవంబులగు తురంగములం బూన్చిన ప్రశస్త స్యందనంబెక్కి గిరిపురి సొచ్చి నగరి కరిగి యంతఃపురమున నున్న ధృతరాష్ట్రునకుం దన రాక నెఱింగించి పుచ్చి, యతనిం గాంచి యుచితగుల మెఱింగి, సభ్యశీలవరులైనను నత్యాదరమున నెత్తి సమీపమున నునిచిన గౌరవించియుండి చేతులు మోడ్చి యిట్లనియె :

సంజయుని పునరాగమనము

"దేవర పంపఁగాఁ జని యుధిష్ఠిరునిం జూచి వచ్చినాఁడను. అప్రమేయ గుణపూర్ణుఁడగు నా భూపాలుండు మీకు నమస్కరించెను. నను సన్మానించెను. ఇచటి బంధుల నెల్లఁ దలఁచెను. మీ సుఖ శ్రీవిధములను, సుతుల సేమంబును బ్రసన్నుఁడై నన్నడిగెను."

అనుడు, ధృతరాష్ట్రుఁ డిట్లనెను

"అజాతశత్రుసను సేమమె ? అతని యనుజన్ము లెల్ల సుఖులే ? బంధులు, భృత్యులు, సఖులు, మంత్రివరులు నచట సంప్రీతిమెయి నున్నవారె ?"

అనిన సంజయుం డిట్లనియె :

"వా రెల్లరును భవద్బలమునఁ జేసి సుఖమున నున్నారు. జననాథా ! నా స్తవమును బరికించిన నో నది నిజముగాదె ? ధర్మజు

నకు ధర్మువవలె భోగము లింపుగావు. ధర్మములలో సహింపనియుం
నతనికి ప్రీతి మెండు. కురువంశనిధీ! ధర్మరాజు మహానుభా
వుల్లడు. అతఁడు దైవమునె యాశ్రయించియున్నాడు. అతఁడు
నీపైన పుణ్యమును శాపమును పెట్టినాఁడు. నీవు నీ పితానుసకు
వశుఁడవై యుచితమగు విధమును తలఁపవు. ఇంక కార్యనిశ్చయము
కర్ణ సౌబలాధీనమగుట నిశ్చయము. నీ మాట వినియు నొప్పరు.

"ఆలు బిడ్డలు లేని బ్రహ్మచారియగు కొయ్యగాక కుమారులఁగూడ
పెట్టి కుడుమవా రిట్టి క్రొవ్విదములు సేయనొచ్చు టిచ్చగించి
చూతురే? నృపు లెంపైనను నకులతలేబాలగు కొంటకులఁ గానరే?
ఇట్లు చెడుతెరువున బడ్డచో దగస్రుసెప్పక యుపేక్షింతురే? కౌరవే
శ్వరా! ప్రజ లెల్లరును నిన్ను తిట్టుచుండగా విని మనస్సు నొప్పు
చున్నది. చెవులు చీకులుగట్టినవి. దుస్ససేనుఁడును సౌబలుఁడును
నిమ్ముఁ బట్టి యాడింపగా నీవును సుయోధనుఁడును బొమ్మలవలె
నాడుచుందురు. తుద కలసి పాండుసుతు లాగ్రహము వహించి
యుద్ధమునకు దిగిరేని నీ చలమును, బలమునుఁ గులమును క్షణములో
నశింపఁజేయరే?

"కౌరవనాథా! యుధిష్ఠిరుని సైరణను మనవారలు వెలుపుగా
సమర్థింతురు. ఇది యొక పొట్టేలు పర్వతమునుఁ దాఁకి కొంట మోపె
నని చెప్పినట్లున్నది. అనుజులకు నడ్డుపడి వారి నేమియుఁ జేయనీ
కుండుటను నీవును మెచ్చితివి కదా? సాధువుగ నుండువాఁడు రేఁగి
నచోఁ దుదముట్టఁ దఱుమక నిలువడు సుమా! అప్పుడు బాదమునఁ

గీడు పుట్టెను. నీ యుపేక్షయే యింతగా నిచ్చువెట్టి కాల్చినది. ధర్మజుఁడు వశీకృతచిత్తుఁడే కాని నెత్తని పుని. ఎల్లరును నీ వయి నధర్మమును చూపుచున్నారు. ధర్మజుఁ డాగ్రహించినచో నతని మరల్ప సాధ్యమే ?

"జననాయకా! నేను మిగుల బడలితిని. ప్రొద్దుపోయెను. ఇప్పుడు సెలవు గైకొని రేపు పుత్త్రులును, బంధువులును, నాప్తులును నీవును వినునట్లు సభ కార్యసారమును సవిస్తరముగ విన్నవించెదను."

కురువిభుఁడు

అనుచు 'స్వస్తి' యని సంజయుని వీడుకొలిపి కొంత ప్రొద్దు కార్యచింతను మునిఁగి, దగ్గఱ నొకానిఁ బిలిచి వేగముగ విదురుఁ బిలుచుకొని రమ్మని యానతిచ్చెను. వాఁడును సత్వరముగాఁ జని యతని గొనితెచ్చిన నమ్మహాత్ముఁడు రాజాజ్ఞను విని తనయొద్ద నునిచి కొని యతని కిట్లనియె.

ధృతరాష్ట్రుఁడు విదురునితో భాషించుట

"పాండురాజసుతుల పాలికి సంజయుఁడు దిక్కుకు పోయి వచ్చి సమ్ముఖమున నన్ను బాగా దూఱి, రేపు వారి పలుకులు చెప్పెదనని వెళ్లెను. అప్పటినుండియు నన్నొకఁ గప్పికొనిన చిత్తవృత్తి గలిగెను. మేను నిప్పులఁ గాలినట్లగుచున్నది. నిద్రపట్టదు."

అనిన విదురుఁ డిట్లనియె :

"అనఘా ! బలవంతుఁడు పైనెత్తివచ్చినప్పుడు బలహీనుఁడును, ధనము గోలుపడిన యతఁడును, ప్రుచ్చిల చేయు వాఁడును, కామాకులచిత్తుఁడును నిద్రలేక కుందుదురు. ఇట్టి రోగములలో నేదైన

దల్లడిల్లుచున్నది. హితభాషణముల దానిని డిందుపఱుపుము. నీవు ధర్మాధర్మవిదుఁడవు. ప్రజ్ఞానయుక్తుఁడవు. నా సంతాప ముపశమించు నట్లు భవద్వచనామృతము నా యుల్లమున వెలిఁగొల్పుము."

అనిన విదురుఁ డిట్లనియెను :

విదురనీతి

"రాజా! జనుల కొండెకాండ్రవిధమున నడచుచు, లోకనింద్యముల నుపగించుచు, పరులకెవ్వరి కులుకక, యందరతోడనుఁ బొంది పొసఁగి మనుట తెలుపును."

"కౌరవేశ్వరా! కోపమును, ప్రశస్త్యపాటయును, గర్వమును, నోర్వలేమియు, గురుభక్తిమాంద్యమును, నిర్వ్యాపారత్వమును కాపురుష గుణములు."

"రాజా! పలికినను, చూచినను, వాలినను, బంధువులను సమున్నతారాధన సంకల్పించి ప్రయత్నించినవారి పాలనముచేయు గుణవంతుల కాసింప నవశ్యము."

"యుక్తాయుక్త విచక్షణాశూన్యులు సొమ్ముగలవారి నొల్లరు; తమ్మొల్లనివారి వెనుకఁ బడరు. అధికస్థితి గలవారి నాశ్రయింతురు."

"రాజా! ధనమును, విద్యయు, వంశమును, దుర్మదులకు మదముఁ గల్గించును. సజ్జనుల కడకువయు వినయమును గల్గించును. విలుకాని యుజ్జ్వలశర మొక్కనిమాత్రము నొంచును. తప్పిపోయి నను తప్పిపోవును. కాని నేర్పరియైనవాని నీతి, పగతుఁడగు రాజును, నతని భూమినిఁ గూడ జెఱచును."

"రాజా! వినుము. మధురాహారములు గొనుటయు, సెజ్జలందు నిద్రఁగూర్కి-నమెడ మేల్కనియుండుటయు, గార్యాలోచనము సేయుటయు నొంటరిగానికిఁ దగదు."

"నడవడియను మున్నీటిని గడవఁబెట్టుటకు సత్య మోడ వంటిది. దానికి మించిన గుణ మింకొకటి కలదే?"

"క్షమియించువానిని గని శక్తిహీనుఁడందురు. ఐనను క్షమయే నిజమగు భూషణము. ఖ్యాతిని గోరినవారే దానిని దాల్తురు."

"పరుసములు పలుకకుండుటయు, పాపకార్యములు సల్పకుండుటయు నుత్తముల గుణములు."

"కురువరేణ్యా! చెల్లియుండియు సైరణ చేయువాఁడును, పేదవడియును నర్థికిఁ దనకుఁగలిగినంతమట్టుకుఁ బ్రియముతో నిచ్చువతఁడును పుణ్యపురుషులని యార్యులు చెప్పిరి."

"న్యాయార్జితమగు విత్తము నపాత్రుల కిచ్చుటయు, పాత్రుల కీయకుండుటయుఁ జేటు పుట్టించును."

"వెలఁదియు, జూదమును, మద్యపానమును, వేటయు, పలుకు ప్రల్లదమును, పరుషమగు దండమును, నిష్ప్రయోజనముగ సొమ్ము వమ్ముసేయుటయు నివి సప్తవ్యసనము లనఁబడును. వీని నవలంబింప జనదు."

"తన స్థితికిఁ దగిన వేషమును, తనుఁజూప బోగపుకొన కుండుటయు, నొచ్చియునుఁ గీడు పలుకకుండుటయు, నిచ్చి వగవకుండు

"రాజ్యమునందక్క సదియ చాలునని తమ్ముని భాగమునకున్ నీ వొంటరిగ మ్రింగఁజూచెదవు. అది యెట్లు జరుగును? ఆమిషము చవిని లోలతచే మీను గ్రక్కున గాలము మ్రింగిన ట్లున్నది. ఇంతకును నుక్కుపున్నెక్కైన నీకొడుకు నూరుమంది నిన్నిటివంటి యేమి లాభము?"

అన విని ధృతరాష్ట్రుడు సంతాపముచే నిట్టూర్పు విడిచి కొంత సేపు మ్రాన్పడి తలఁపులు పెనఁగొన నిద్రలేమిఁ దను వలయింపఁగ విదురునితో నిట్లనియె:

"ఇంచాక నీ పలుకులచే సందేహము తొలఁగి కొంత డెందము వడెను. సౌజన్యనిధీ! నాకు న్యాయానయముల చందములు చెప్పు చుండుము."

అనిన విని విదురుఁ డిట్లనియె:

"కమియ బండకుండఁ గాయను గోసిన రుచి చెడుటయేగాక విత్తునకుఁ జేటుగలుగును. పక్వమైనపిదపఁ గోసిన ఫలమూ లభించును, బీజమూ చెడదు. కార్యసిద్ధి చందమును నిట్టిది."

"మాలకరి పుష్పములు గోయునట్లును, తేఁటి పుష్పముఁదేని యనుఁ గ్రోలెడిరీతిని, నెదిరి కందకుండఁగఁ గార్యఫలము గొనువడి. బొగ్గులకునై చెట్టును నఱుకుదురె?"

"అధిపా! పరుల ధనమును, విద్యాపరిణతిని, తేజమును, బలమునుఁ జూచి యసహ్యపడువాఁడు దెవ్వులులేని వేదనఁబడును."

చేసి యున్నవాఁడు." అనిన విదురునితో ధృతరాష్ట్రుఁడు :
"నీచెప్పిన నీతివాక్యముల నా మనము దనివోదు. ఇంకను చెప్పుము."
అనవుడు నతఁడు వెండియు నిట్లనియె :

"సకల పుణ్యకర్మచయమునకు నొకదెస, పాడి దప్పకుండుట యొక్క దిక్కని శ్రుతులు తెలిపెను. పాడి కలిగినవారి నిహలోక ఫలము లెల్లఁ గల్గుటయే కాక; కీర్తియు లభించును. భూలోకమున నెంతకాలము కీర్తి నిల్చునో యంతకాలము పుణ్యలోకము గల్గు నందురు. తొల్లి ప్రహ్లాదుఁడు దైత్యపతి సంభవుఁ డయ్యును దన కొడుకు విరోచనుఁడును, అంగిరసుఁడను విప్రకుమారుఁడు సుధన్వుఁడును దమ తమ ప్రాణము లొడ్డగా నొడ్డి యొక్క ధర్మసందేహమునకుఁ బన్నిదము సలిపి వచ్చి తన్నడిగిన, నతఁడు కొడుకు కతంబున లాంఛనమని తలఁపక మధ్యస్థుఁడై సుధన్వు గెలిపించి యాతనిచేత నిజతనయుని జీవితము దానముగాఁ గొని వానిని బ్రదికించెను. కావున నీవును ధర్మము విడువక యధర్మోపేతులైన నీ కొడుకుల వలని పక్షపాతము విడిచి న్యాయమార్గము ననుసరింపుము. వారును వీరును నాపద లేక బ్రదుకుదురు; నీవును శోకము లేక తనుకుదువు." అని చెప్పి మఱియును :

"పాపములు కర్జములని చేయ నవియు నింపగును. ధర్మ వ్యాపారములకార్యములై పరిణతిఁ బొందెనేని యవి యశ్రేయము కాన్పించును.

"ఆర్యులు లేని సభయు నొక సభయే? సమంచిత ధర్మము

పలుకని యాహ్యలాహ్యతే ? సత్యము కానిది యాహ్యలు పలికిన దైనను ధర్మమగునే ?

"నీతిపథమున బ్రతుకనేర్చుట యుత్తమభంగి. శౌర్యసంజాతములైన సంపద లొంగుట మధ్యమవృత్తి. గౌరవహీనమగు భారవాహియగు జీవనము కనిష్టము. నీతికి బాహ్యులైన వారిని నుత్తములు మెత్తురే ?

"నీ పుత్రులెల్ల కయ్యమును కెప్పుడును కాలుద్రవ్వుదురు. వారి మంత్రు లంతకు మునుదరు. విదుర మూగలు. ఇంక నీవో నీతి మార్గము ననుసరించవు.

"పాండవులు శౌర్య మెఱుగరు. నీతిని మెచ్చుదురు. ఎవరేది సహింపగలిగిన మించెదరు. అట్టి పెద్దలకని నా మంట నార్ప నశక్యమగును.

"పాండవులు లోకతంత్రమెఱిగి నిన్నును భక్తిశ్రద్ధలతో సేవించు వారు. నీవు వారిని గన్నకొడుకుల వలె చూచుకొనుము.

అని పలికి మఱియు నిట్లనియె :

"రాజా ! కారణము లేకయే యుపకారపరత్వమున నొరుల కార్యములకుం దోడ్పడువారగు పాండవుల కేడుగడయై యున్నారు.

"కురువంశ ప్రసూనమగు రాజా ! ఒకని చేతిస్రోపును, స్రోపును, నున్నతియుం బడసి యాతనికే కీడుదలంచిన కృతఘ్నుని కీడుగనైన రోతపుట్టక కబళింపక కుక్కలు నొదలునే ?

"కావునఁ గృతముఁ దలంపమి గీడు. పాండురాజు నీఁకు బరమ భక్తుఁడు. పాండవులు దేశోలాభములఁ గాంచిన వారు. వారల నాదరింపుము."

అని చెప్పి వెండియు నిట్లనియె:

"జీవిత మరణములు, భూషణ దూషణములు, లాభజన యాజనములు, సుఖ దుఃఖములు నెడనెడవచ్చును. వాని కింత వగవనేల?

"దుఃఖముచే బలము దఱుగును. చేయఁ గ్గను బుద్ధి చెడును. తెవులు వచ్చును. మిక్కిలి వగచి నలఁగినఁ బగతురకు ప్రియమగును. అందుచే మహారాజా! వగచుట యుడుగుము."

అనిన ధృతరాష్ట్రుఁ డిట్లనియె:

"రిత్త యగు నపచారవాక్యములచే నేను [illegible] ధర్మతనయు నడికించితిని. గర్వోద్ధతులగు మత్సుతులకు యుద్ధము మృత్యువగును. కలహములచే సౌఖ్యము పుట్టునా? అందుచే దుఃఖ నివారక మెద్దియో దాని నెఱిఁగింపుము."

అనిన విదురుఁ డిట్లనియె:

"కౌరవేంద్రా! నియత తపమును, నింద్రియ నిగ్రహమును, విద్యయు శాంతికి కారణములు. వానికంటె లోభ మడఁగుట మేలయిన శాంతికారణము.

"మానవేంద్రా! జ్ఞాతులతో జగడ మాడరాదు. గోత్రాతము

నాక్రమించకో నగగు. విప్రవర్గమునకుఁ జన వీయఁగూడదు. నాతులఁ గారింపఁబడదు.

"అలమికొని రొమ్ముటొగుల స్రోపులను బ్రాపులను నెలమి కలిమిఁ బొందిన బ్రాతులు పెక్కురు గూడి యున్నప్పుడే దామరకొలని వలె సిరి కొంపఁ బట్టగలరు.

"ఒంటియున్న తరువును కరి తురగాది ఘట్టనయును గాలి యును నొంపవె? అట్లుగాక యనేక భూరుహావృతమయి గుంపయి యున్నచో నుపద్రవముగల్గునే? అట్లే యున్నదమ్ముల కొగ్గికగా నున్నచో నస్త్రివారకిని గెలవఁగలుగుదురు. అట్లుగాక నిల్చినచో కెలని కొల్లలనిట్టమెంతయుఁ బరిగిరగరు.

"కావునఁ గలిగిగాను గాలిచేప్పులును నొంతరాలకుఁ బ్రాపై యొగడికిని పెదిగి యొయులగునగు. పరుల గొబ్బెడి లేని రాజ్యము పూజ్యమానిగాను యగఁగును. విన నొసగుఁ గుందిన కౌంతేయులను తడఁబడక తెచ్చి యుచితమున నిచ్చి నీవుపుట, సకలాపకులకు నేను మొదగూర్చుట యగును." అని చెప్పి మఱియు నిట్లను :

"ప్రియవాదులెందరు గలరు. అప్రియమగు గా కేమియని పథ్యము పలుకువారు లేరు. జూదమాడునప్పుడు నే నడ్డపడి, యప్రియ మగుటకు శంకింపక న్యాయము పలికితిని. అది నీకు రుచింపక, రోగికిఁ బథ్యాహారము వల కంటగించు నట్లయ్యెను. ఐన నిప్పుడుఁ జెప్పెదను వినుము. కాకములఁ గైకొని మయూరములఁ బరిహరించు

విధమున, మార్జాలముల బాటించి సింహముల యెడ సనా
దరము సేయు విధమున సుయోధనాదులను బట్టి యుధిష్ఠిర
ప్రముఖుల విడిచితివి. నేడు కార్యము వచ్చినప్పుడు గోడ
మిడుంగులు సోకినట్లు తల్లడించెదవు. కులమునకై గొడ్డని
దొరంగుటయు నీతి యని పెద్దలు చెప్పుదురు. గర్వియుపరుడై
సద్బుద్ధి చెప్ప వినఁడేని మనము దుర్యోధనుని దొరఁగిన నేమియగు?
అది యట్లుండె. సంపద సహాయము నపేక్షించి యుండును. సహా
యము సంపద నుద్దేశించి వర్తిల్లును. ఇట్లొకటొకటి పొత్తునఁ గాని
సిద్ధింపవు. కాన నీ సంపద పాండవులకును, వారి సాహాయ్యము
నీకును ప్రియంబొనరింప నొండొరుల కలయిక మేలు గాక వారలను
వెలిసేయుట లెస్సయగునే? కురువంశ విస్తారకులగు భీష్మయుధిష్ఠిరు
లును, నయ విక్రములగు కర్ణార్జునులును, ప్రతాపధాములగు భీము
దుర్యోధనులును, శస్త్రాస్త్రపారగులగు నభిమన్యు లక్ష్మణప్రభృతి
కుమారులును, శాపానుగ్రహ సమర్థులగు ద్రోణ, ద్రుపదాది వర
మాప్తులును వారి వారి బంధు మిత్ర జనములును, నొక్కమొగమై
నీపనుపు సేయుచు నయవిక్రమము లప్రతిహతములై యుండ, పృథివి
శాసింప భవదీయ విభవ ముజ్జ్వలమై యొరుల కెడ లేక చెల్లుచున్న
నెంత యొప్పగునో విచారింపుము. పాండవులు ధీరసత్త్వులై వైర
మెత్తక యూరక తొలఁగి యుండరేనియుఁ గతిపయ దినములలో
జీకాకుపడి చెడునుగాక గాంధారనందనునిచే వసుంధరా పరిపాలన
భారమునిర్వహింపబడునే?”యనిన విని ధృతరాష్ట్రుఁడువిదురునకిట్లనియె:

"నీవు చెప్పిన మాటలు నిర్మలములు, నిపుణ సమ్మతములు, రాజనీతి మార్గబోధకములు. ఐనను బుత్త్రు విడువనోపను. ధర్మో జయతి యని యుండువాఁడను."

అనిన విని విదురుఁ డిట్లనియె:

"దేవా! పాండవులు గుణహీనులైనను విడువఁదగరనిన, సకల గుణసంపన్నులై భవత్ప్రసాదముఁ గోరుచున్న కౌంతేయులను దిగ విడువదగునే? ఏను నీకు హితము గోరెడువాఁడనని నిశ్చయించి నా బుద్ధి వినుము. వారి కిప్పుడునుఁ గొన్ని యలంతి పల్లెయలైనను సగర్థ్యధను నొసంగుమంది యుధిష్ఠిరుండు హెంచుగు వలచిన లెస్సయని నా మతము. అట్లు కాని నిట్టపలయుఁగని చెప్పితినేని యుద్ధమున బహ్వాత్మాపము పుట్టును. దాని కిప్పుడు ప్రతీకారము లేదు. కావున నెల్ల భంగుల నియ్యకొని పాండవులతోడ సంధి చేయవలయును. అట్లు గాక చావనెంచనన్న పరస్పరము పోట్లాడుకొనుటకు సమరము చేయవలెనే? శరీరము లాధి వ్యాధి జరా సమన్వితములగుట మృత్యువు సహజము.

"గజతురగాది సంపదలు గలిగి, ప్రజానురంజకమగు పరిపాలన మొనర్చి విజయశీలురై, సమస్తభోగభాగ్యము లనుభవించిన రాజులు మరణించక నిల్చిరే? కావునఁ జెవికిఁ జేదైనను నామాట వినినచో నిహపర శ్రీవిభవములును కీర్తియును గల్గుట నిజము. మఱియొకసారి యూహించుకొనుము. ధర్మతనయు నెట్లైనను దిగవిడువకుము. దృఢమతివై కొడుకులకు బొందగు చందము చెప్పుము."

అనిన నాంబికేయుఁడు :

"నీ పలుకులను గలఁకఁదేఱి బుద్ధి తెలివి నొందెను. ఇట్లు చేయువాఁడను. కార్యమును, ధర్మమును, యశమును, లాభమును, గూడ నిదియ."

అనుడు ముదమును, నమ్మికయు నాత్మఁ బెనఁగొన నృపు తోడ విదురుఁ డిట్లను :

"పెద్దవడికి నీ మనస్సు కార్యప్రవృత్తి మాఱినయది. సుయోధనుని జూచి యకుంఠితమగు నిశ్చయముతో నతఁడు వ్రాలిన వెనుక వ్రాలకుండినచో మముబోఁటులకుఁ బ్రియమగును."

అని పలికి నిట్టూర్పు నిగిడించి

"దైవము నేర్పుగాక, ఇటు చేయ నేర్తును, యిటు చేయ నేరను బొమ్మని నరునకు పలుక వశమె? ధరణీనాథా! పౌరుషముకంటె దైవము యధికము."

అనిన విదురునకు వైచిత్రవీర్యుఁ డిట్లనియె :

"ధర్మపథమును నీతితత్త్వము తెరువును నిర్మలమైన నీమాట లచే నాకు తెలియఁజెప్పితివి. ఇంక పారమార్థికదృష్టి యెట్టిదగునో చెప్పుము."

అని యడిగిన విదురుఁ డతని కిట్లనియె :

"నాకుఁ దోఁచిన యున్నియు నా నేర్చినట్లు నీ కెఱింగించితిని.

గావించి రక్షింపవలయును." అని ప్రార్థించిన భార్గవుండును దపను
రూపములగు బలుకుల నారాధించినఁ బ్రసన్నుఁడై సనత్సుజాతు
డధ్యాత్మవిషయములగు వివిధవాక్యముల సోపానప్రకారముగ నంత
కంతకు సూక్ష్మములగు నర్థముల సమర్థించుచు, నంగఁ బ్రహ్మచారియుఁ
డియ్యది యేర్పడ నడిగె నది యెల్ల వివరించుచు హృదయపుష్కర
కలితమగు పరతత్త్వము ప్రసాదించునట్టి సూక్తులను గ్రహించు
చుండ, నెట్టకేలకుఁ బ్రభాతమగుటయు, ధృతరాష్ట్రవిదురుల
నామంత్రణముచేసి య ద్దేవముని యంతర్ధానమునొందెను.

ఇంతలో తెల్లవారెను.

3

సభలో సంజయుని వాక్యములు

ఇట్లు సూర్యోదయ మగుటయు ధృతరాష్ట్రుఁడు దత్కాలోచి
తాచారములు నిర్వర్తించి, తగు తెరంగున నలంకృతుఁడై యాస్థాన
మండపమున కరిగి పేరోలగంబున్న గుంభసంభవ
కృప కృతవర్మాశ్వత్థామ కర్ణాదులగు దొరలును,
భీష్మ విదుర బాహ్లిక సోమదత్త భూరిశ్రవస
ప్రభృతులగు బంధుజనులును, దుర్యోధన దుశ్శాసన ప్రముఖులగు
కుమారులును లోనుగాఁగల సమస్తపరిజనములును వచ్చి బలసి
యుండిరి. అయ్యవసరమున సంజయుఁడు వచ్చి వాకిట నిలిచి ప్రతీహా
రులవలనఁ దన్నెఱిఁగించి పుచ్చి వచ్చి సముచిత ప్రదేశమునఁ
గూర్చుండి, తనమాటలు వినుటకుఁ జడిముడి పడుచున్న కొలువు
పలుదిక్కులఁ జూచి యిట్లనియె :

# ద్వితీయాశ్వాసము

"ఏ నుపప్లావ్యమున కేఁగి తొలుత వాసుదేవార్జునులఁ జూచితిని. వారు నీతిపథము దప్పని మాటలు బలిమిఁ దోఁచునట్లు నాడిరి. చెప్పెద వినుఁగు."

అనిన విని ధృతరాష్ట్రుఁడు "ఆ వాసుదేవుచిత్తం బెట్లున్నది? అతఁ డేమనియెను?" అని యడిగిన నతనికి సంజయుఁ డిట్లనియె:

"అమ్మహాత్ముని హృదయమున నీపైనఁ గూర్మి యెట్టిదో కాని తానును నరుఁడును సత్యభామాద్రౌపదులును రహస్యగోష్ఠి నిరతాత్ములై సుతులు సైతము చేరని కాంతానివాసములో నుండిన చోటు నకు నన్ను పిల్పించెను. ఏనును తత్ప్రకారము పరిచారులవలన ముందు యెఱిఁగించినవాఁడ నగుటఁ జేసి కంచుకమును శిరోవేష్టనమును ధరించి వినీతవేషుఁడనై శ్రీకృష్ణార్జును లనేక మణిమయ భూషణ ప్రభాభాసితులై గొంకు-సెజ్జన యున్నవారు. కృష్ణుఁడు పవ్వళించియుండి చాఁచిన చరణములు తొడలపై నిడికొని యర్జు నుఁడు కూర్చున్నవాఁడు. సత్యభామయుఁ బాంచాలియుఁ గద్దియలపై నున్నవారు. సవినయముగా నేనును దండప్రణామము చేసిన నవ్వాద రించి, కృష్ణుని చేనున్న వస్తువు పసుపునఁ గనకరత్నమయమగు నతని పాదపీఠమున నతఁడు త్రెళ్ళించిన కాళ్లు గిగిచికొన, నిద్దఱు ముగ్గియ ఫల్గి తెచ్చి నాకుఁ బెట్టిన, నేనును దానిని కరతలమున నంటుచు ధరణీతలముననే కూర్చుండి, కేలు మొగిడ్చి ఫాలతలమునం గదియించి నీలవర్ణులు బాహుబలమదభరితులును నగు యేనుఁగుదోయియుం బోలె నున్న యమ్మాధవధనంజయులఁ జూచునప్పుడు నాకు హర్షాశ్రు

పులకలును, దదనంతరంబ భయమునుఁ బుట్టెను. అంత నమ్మ
హానుభావులు నన్ను సంభావించి తా ముపయోగించునట్టి యన్నపాన
ములను, దమకుఁ గట్టఁదగినట్టి వస్త్రములను, దాము దొడఁగునట్టి
భూషణములను నాకుఁ బ్రియంబొప్పఁ గారవించిరి నేనును నా
పోయిన కార్యము విన్నవించితిని. విజయుఁడు బాగుమొగముతో
దానికి నుత్తరము వలుకఁ దొడంగిన వారించి నీరజోదరుఁ డిట్లని
యెను :

సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ గృష్ణుఁడుచెప్పిన మాట తెలియఁగించుట

"సంజయా! ధృతరాష్ట్రవిభుని పెద్దకొలువు నందుఁ దత్పుత్త్రులు, గురుఁడును, గృపుఁడును, భీష్ముఁడును మొదలైన సకలజనులును వినుచుండఁగా నిట్లనుము.

'అజాతశత్రుఁ డలుగుట పెద్దల నగ్నిపుట్టి నట్లయ్యెను. మీగ దాని నార్పలేరు. కావున మీరు నేర్పుతోఁ జేయవలయు పనులను వినుఁడు :

"ఉన్న ధనమంతటిని సత్పాత్రదానము సేయుఁడు. చెలులను జుట్టములను నాశ్రితులను రావించి సత్కరింపుఁడు. ఇచ్ఛానుగుణముగ నింద్రియసుఖము లనుభవింపుఁడు. అంత్రను బిడ్డల [illegible]విధముల గారవింపుఁడు. మీ వాంఛలను వెంటనే తీర్చుకొని మాచేతఁ బ్రాణము లుంచుకొని యుండుఁడు" అని చెప్పుము. ఇంకే నేమనిన కంటివేని పడరాని పాట్లుపడి ద్రౌపది దస్యులనున్న నన్ను 'గోవిందా! కావుము' అని పలవించుట నాకు తీర్చరాని యప్పైయున్నది. అంగనచే

నేను తేరు నడిపింపగా కిరీటి గాండీవ మెక్కు-వెట్టి నేఁడో రేపో యనికి వచ్చును. మీా ప్రక్క లెప్పించు కొందురు ?"

అని పలుకుచున్నప్పటి హరి యొత్తిగోలును, నీ కొడుకు విడుపోవ మియును దలఁచి భయమందితిని. ఇతఁడు వారల నెఱుఁగఁడు. భీష్మద్రోణుల ప్రాపును, కర్ణు గర్వమును దన్ను గెలిపించునని నమ్మి యున్నాఁడు." అనిన విని ధృతరాష్ట్రుఁడు "అర్జునుఁ డేమనియెను ?" అని యడిగిన నతనికి సంజయుఁడిట్లనియె :

"నరేంద్రా! నరుఁ డేమియు బోధమియు సుస్థిరుఁడై నూనని గాయామువలె స్వచ్ఛమై గంభీరమగు పలుకులను నుడివి తనకన్నుల నరుణచ్ఛవి నిండగా నిట్లనియె :

"సంజయా! సుయోధనుఁడును, నతనికిఁ దోడ్పడవచ్చిన రాజులును వినుచుండ నా వచనములుగా నిట్లనవలయును :

'ధర్మజుఁడు పాలుగాగ సుయోధనుఁ డీయ నిరాకరించినచో నది మేలు' పొగరుచే మున్ను తాను చేసిన గుహ్యాగ్యములకు మఱుఁగుపెట్టి నట్లగును. నేను నుపరిదర్శనము క్రియ మందా గము. మా యిరువురిలో దుర్యోధనుఁడు కయ్యము పెట్టుకొనినచో ధర్మజు కార్యసిద్ధి యగుట నిజము. అంపశయ్యను దుర్యోధనుఁడు రణాగ్ని బడక తక్కినచో వనవాసమున భూశయ్యను ధర్మజుఁడున్న యాయాసము పోవునె ? సత్యమును నమ్మి యవమానములను మనస్సున నుంచక లోన నడఁచి యుంచినట్టి కోపాసల మెండియున్న

నిబిడాటవిపైఁ బ్రసరించు తీవ్రదావానలము వలె శాస్త్రనలపైఁ గవియించి నిల్చినగాని ధార్తరాష్ట్రులు యుధిష్ఠిరుని సరకుఁగొనరు. అంత్యకాల విచలత్కాలాకృతియై భీముఁడు గదనారించుచు నున్మత్త మాతంగచయము నుగ్గుసేయుచు, రథవ్రాతమును చదియుచు, హయవ్రజమును పొడిగావించుచు, సంరంభతుంగాంగుఁడై కదియఁ జూచి సుయోధనుఁడు రాజ్యభాగ మిచ్చును. క్రొవ్వులి ల్లెల్లె యుఱుకునట్లును, పెనుగాలి జీమూతబృందముపై వీచునట్లును, నాకొన్న లయరుద్రుఁడాగ్రహమున జగత్ప్రళయము ముట్టునట్లును సాత్యకియు నకులుఁడును నభిమన్యుఁడును, నెదరినబలము నెల్ల నట్టిటు చేయఁజూచి కౌరవులు సంధి కిచ్చగింతురు. ఉగ్రసేన వీరులగు ద్రౌపదేయ లేవురును సింహకిశోరములు మదోన్మత్త గజావళిని దరియునట్లరాతిబలమును ముట్టి నెత్తురు నీటఁ దోగ్ప్రింగాని కౌరవులు సంధిచేయరు.

'అచ్యుతుఁడు బాలక్రీడ మహాసురప్రకరమును భంజింపఁడే? అతనిని త్రిలోకములు నారాధించుట లేదె? అట్టి మహాత్ముని సుయోధనుఁడు సరకుసేయఁడు. మేమతని కొక లెక్కయా?

'మేము పితామహ గురుకృపాచార్యులకు నమస్కరించి యస్మదీయ రాజ్యభాగమునకై పోడరి కయ్యము సేయువారము. కౌరవుల పక్షమున నెవ్వరేని మాతో యుద్ధము చేసినచో వారి శస్త్రాస్త్రములు ధర్మప్రతిహతములగునని తలచెదము. పన్నెండు సంవత్సరములు వనమున నట్లిడుమలఁ బడి, జనపదమునఁ బడసుము

డవయే డజ్ఞాతవాసాయాసమ ట్లనుభవించి వచ్చి, మా తండ్రి పాలికై యుద్ధము చేయ మాకున్న నింద్రాదిసురసహాయులయ్యును ధార్తరాష్ట్రులు గెల్చునాపై రేని ధర్మమునకంటె నధర్మము బలవంతమైనది యగును. ఇంతియు కాని మా చేయునది గీతైనది గాదు. మేము వాసుదేవుని మున్నిడుకొని యుంతుము గావున నీ యుద్ధమున జయము మాకు సిద్ధము. ఎట్టిననుగర్వసహితముగా గాంధారీనందనులను గనిమి మేము భూమిగొనుట తప్పదు. గాండీవము దివియకయును గుడుసువడియెడు. బాణములు దఱుగుచుండిన తూణీరము వెడలెడు. తోలుబొప్పు మహానాగమునుబోలెడు గగవాలము బూని యొఱ వెలికి నిగుడుచున్నయది. కావున మా కవశ్యము సంగరము సంభవించును. పాశుపతాది దివ్యశరములచే సకలశత్రుసంక్షయము చేసి శాంతిఁ బొందెదను. సూతనందనా! నీవు సుస్థిరుఁడవై యింతయుఁ దెలియఁ బలుకవలయును. ఈ మాటలు విని కురువృద్ధుఁడగు బాహ్లికుఁడును పితామహుఁడగు భీష్ముఁడును గురుఁడగు కుంభసంభవుఁడును, శిక్షకుఁడగు కృపాచార్యుఁడును, గురుపుత్రుఁడగు నశ్వత్థామయును, సద్బుద్ధియగు విదురుఁడును, ధర్మాదిగుణశల్యుఁడగు శల్యుఁడును నెయ్యది నిశ్చయించి పలికెదరో యట్లయ్యెడు. సుయోధనాదు లాయుష్మంతుల గుదురు గాక!' అని పలికెను." అని చెప్పిన విని మందాకినీనందనుఁ డందఱు విన సగర్వోక్తిని నిట్లనియె :

"సలిలగర్భుఁ డాకర్షించి పెగ్గొలుపుచున్న సున్నడ సురపతి ప్రముఖుల చూడుగలు మెఱయు తేజమున మిఱుమిట్లుగొన నిద్ద

అచ్చట నారసిరోని యరుగఁ జూచి 'వీ రెవ్వరు ? ఇమ్మెయిగు మీరారుంతే సరకుసేయని యట్లు పోవుచున్నారు ?" అని బృహస్పతి ప్రశ్న నడిగిన చతురాస్యుఁ డతని కిట్లనియె : "తపము పెంపును, బలశౌర్య దర్పములును గలిగి లోకహితార్థముగా నరనారాయణులను ప్రసిద్ధమును లన్నియుగములందును చరింతురు సుమీ. వా రనిమిషహితమును, దనుజనాశనమును జేయుదురు. అధర్మసంగ్రామము గల్గిన చోట ధర్మపక్షమును గెలిపింతురు. దేవాసురయుద్ధకాలమున నింద్రుఁడు వీరి నారాధించి తో డడిగినఁ జనుదెంచి పౌలోమ కాలకేయుఁ దులగు ననేక దైత్యదానవులఁ జంపి యింద్రునకు విజయము గావించిరి. అది మొదలుగా వీరల నెల్లరును నెఱిఁగియుందురు. ఇది యొక్క తేజము రెండు దెఱంగులై వెలుఁగుచుండును అని చెప్పెను. వినోదార్థము జన్మాంతరము నొందిన యమ్మహాత్ములు గదా యీ యర్జునుఁడును వాసుదేవుఁడును! అర్జునుఁడు సముద్రతీరమున హిరణ్యపురము పొడిచి నివాతకవచులను నఱుపరి పేర్పుర నిర్జించి పర్జన్యునకుఁ బ్రియము చేసెను. వాసుదేవు పరాక్రమము కంసనరకాసుర ప్రముఖ నిఖిల దుష్టనిగ్రహమున బ్రసిద్ధము కాదె? ఉన్నట్లు చెప్పెదను వినుము:

'ఆ యిరువురు నొక్క తెఱంగై యుద్ధమునకు వచ్చిరేని మన కే కాదు హరునకైనను నెగ్గరై దాక శక్యమగునె? సారథియు రథియునై యొక తేరుననే కృష్ణార్జును లిర్వురును నతి ఘోర తేజస్సార స్ఫారతఁ దోఁచిన చూచిన నప్పుడు నీకుఁ దెలియును."

అనుచు నా సుయోధను నుపలక్షించి శాంతనవుఁడు మఱియు నిట్లనియె :

"నా మాట కొంకింతయును బెదరవు. ఆశ్చర్యమనిన నీకుఁ బ్రియము. కౌరవ్యులకుఁ గుఱి కాలము వచ్చెనేమో? లేనిచో నిట్టి గర్వితుని నేమనఁగలను? హితములగు నా మాట లిప్పుడు వినకపోతి వేని యిప్పుడు 'నాఁడు వలదని, నీకు వలెనని' యను పలుకులు వినఁగవు గాని! శకుని యిట్టి విశ్వాసము లిప్పుడు సమ్మతింతురు. దుష్టకష్ట నికృష్టోత్కృష్టులగు నిమ్మనుష్యులకుఁ జెప్పెడు బుద్ధులు గాని యొండెడు విన నొల్లవు. ఏమి చేయవచ్చును?" అని పలికెనఁ గాసనుఁడు గనలి గాంగేయుని కిట్లనియె :

"ఇట్లు లాడఁదగునా? నే నేమి చేసితిని? కొలిచి కుడిచి, పాడియు, సత్యమును, బలమును, సగు మాట లనుట యొగ్గగునా? నేను పతికిని, పుత్రికలకును, మానుషులకును హితమగునట్లే వర్తింతును. అట్లు గానిచో నన్ను వారా పంతవానిగా నెంచకు చేయును! నిండు సభలో నిట్టి యన్యాయపు మాటలు పలుకట నశలనగునె?"

అనిన విని భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లనియె :

"పాండవులలోఁ జిఱుత వారగు నకులసహదేవులలో నే యొక్కఁడైనను గర్ణుఁడు గెలువఁడు. ఐనను సిగ్గు లేక పాండవుల గెల్తునని కర్ణుడు పలుకుచుండును. వీని మాటలన్నియును తుఱుపలును వింటారు. మఱి మీలో వారికి వీఁడు సరియని నమ్మి సుయోధనుఁడు విరోధముగాని

సర్వగుణాఢ్యులును, బలవంతులు నగు పాండవుల నవమానించెను. పాండవులలో నొక్కఁ డొక్కఁడే యనేక యుద్ధజయములు గొన్న వాఁడు. ఇతఁ డొక్కఁడ యేమిచేసెనో చెప్పుము. ఉత్తరగోగ్రహణకాలమున నీతని తమ్ముని( గూలనేసి యొక్కొక్కఁడ పార్థుపైఁ గవియఁగ ల్గనే? పసులను గ్రమ్మరించుట కాతఁ డక్కఁడ లేకపోయెనే? ఘోషయాత్రలో భవదాత్మజుని గోల్పడఁడే?

'ఈ దురాత్ముఁడు కర్ణుఁ డెఱుఁగక నీతిబాహ్యుఁడై పలుసిగ్గు ప్రేలరిమాట లాడుచున్నాఁడు. నీవును గైకొని వినుచుంటివి. మేలు కాక!'

అనిన భీష్ముపలుకులు విని ద్రోణుఁ డమ్మహాత్మునితో నిట్లనియె:

"శాంతనవుఁడు సర్వకురుసంతతికిని గావలసినవాఁడు. ఆతని పలుకు లత్యంత హితములు. ఆహవము చేయుట యొప్పుగా. ధర్మసాతితోఁ శాంతనము మేలు. అర్జునుఁడు సంజయుతో నాడిన యాతిశయోక్తులు కావు. ఖాండవదాహనాది ఘనకార్యములు మీరుఁ దెలిసినవే.

"శరశరాసనములు లోకమున నెవ్వరు ధరింపరు? నుగతోసమున యుద్ధముల నెవ్వరు జయము గైకొనరు? కాని యర్జునుఁ డొక్కఁడే విజయుఁడని ప్రసిద్ధికెక్కెను.

"మన మీటన కాదు. అర్జునునకు సరియగు విలుకాఁడు లోకమున నెందును లేఁడు డెల్లము. అట్టివానిని దొడరనగునే?"

అని చెప్పి యప్పాటం బరమహితోపదేశముచేసిన భీష్మ ద్రోణుల పలుకు లాదరింపక, వారికి సహుత్తరము లీయక, వారితోఁ దదనురూపముగ సంభాషింపక, ధృతరాష్ట్రుఁడు వెండియుఁ బాండవులవలని వార్తలఁ గనుటకు సంజయునికుఁ మొగమైనఁ జూచి కురుపక్షవీరు లందఱును ప్రాణములపై నిరాశులై యుండ సమ్మోహిపతి సంజయునితో నిట్లనియె :

"ధర్మపుత్రుఁ డిందఱి విషయములను గుఱించి యేమి తలఁచుచుండును ? ఇచ్చట సైన్యములెల్లఁ గూడియుండుట వినెనే? ఎవ్వరిని గొని యతఁడు కౌరవులపైఁ జెత్తి రాఁ గలఁడు.

అనిన విని సంజయుఁడు వెన్ను నార్చి లేచిపడి మూర్ఛపోయిన చందమున నొందియు మగుడ చేష్టలు తక్కియుండి కొండొక సేపునకుఁ దత్తఱపాటుఁ జక్కఁజేసికొని "అక్కటా! ఈభూపాలుఁ డింత బేల యగునే? యుద్ధప్రయత్నము సేయనివ్వఁగొని మొత్తివచ్చువాఁడని యడుగుచున్నవాఁడు! ఇంత యెఱుఁగని వాఁ డెంత చెప్పినను దెలియనేర్చునే? ఇతని భంగి పుట్టిగనినఁ గొడుకుల తెలివి వేఱయున్న నేల? నే నింక నేమనుదును? ఐనను నన్నడిగిన మాటకుఁ దగిన మాఱుమాట పలుకవలయును కాదె?" అని తలఁచి ధృతరాష్ట్రున కిట్లనియె :

"రాజా! వినుము. ధర్మజుఁడు సంధిఁ జేయఁ గోరును. వీఁడు సగము పా లియ్యకపోయినఁ గాని వీనికొక కీడు దలఁపఁడు. భుజ

బలమున నే రాజ్యము సాధింపఁదలఁచెనేని మీా బలము నెల్లను జీకిం గొనఁడు.

"అత డెవ్వరినిగొని యెత్తివచ్చువాఁడని యడిగితివి నీ నోటఁ గనివార లం దెవ్వరు గలరు ? అవధరింపుము :

"బకవిధ్వంసియు, జటాసురాంతకుఁడును, హిడింబ ప్రాణహారిణ పారీణుఁడును, కీచక నిర్మూలన కేళీలోలుఁడును నగు భీముని ధర్మజుఁడు గొనివచ్చును.

'పాలాక్షుని నెకటి కయ్యమునఁ గన్న ఫల్గునుని భుజాగర్వ మును లెక్కింపుము. అంతటివానినిఁ గొని ధర్మసూతి సమరోత్సాహ ముతో నెత్తివచ్చుటకుఁ గొంకునే?

"గ్రావదేయులును, సుభద్రాసుతుఁడును నకుల సహదేవులు వారు గారె ? ధర్మజుఁడు యుద్ధమున కుమారవరులను గొనివచ్చును.

"నృపా ! వృష్ణికుమారోత్తముఁడగు కృష్ణుని తమ్ముఁడు సాత్యకియు, దవదహనాత్యుగ్రప్రతాపదీప్తులగు కృష్ణాసోదరులు కేవలులె ?

"శౌర్యోజ్జ్వలుఁడగు పాంచాలభూనాథుఁడును, మహితవిగ్ర ముఁడగు మత్స్యవిభుఁడును, వరని తమ్ములును, సుతులును, ప్రతాప నృతులగు కేకయపతులును, జరాసంధసూనుఁడును, సహదేవుఁడును, జయ త్సేనవిభుఁడును, శిశుపాలతనయులగు ధృష్టకేతు వృషభులును, యదుభ ర్తయగు చేకితానుఁడును, దర్పఘనుఁడగు శైబ్యనృపాలుఁడును

గలుగుగాదె ? భీమసేనసూనుఁడు ఘటోత్కచుఁడు దండ్రికంటెను లావును బీరమునుం గలవాఁడు. మాయాబలమున మనబలమెల్ల గలఁచును. మఱియునుం దూర్పున నుత్తరమునను గల నరనాయకులు నానాసేనాసమన్వితులయి వచ్చి విచ్చయినను గిడికిలింత మను చున్నారు. అదియునుం గాక ధర్మజునకు సకల భువనములు నఱ చేతికిఁ దేఁజాలునట్టి గీమంతుఁడు దేవకికొడుకు గలఁడు. ఇఁక ధర్మరాజె త్తిరాక నిలుచునె ?"

అని చెప్పిన సూతపుత్రునకు సంగిలాపుత్రుఁ డిట్లనియె:

"సీవు చెప్పిన యా రథికుత్తోరుసు ప్రాలు లేకాని బలప్రమాణములందు నా రెట్ల రాక తలయు, మారుతి గెలుక తలయు. భీముని దలఁచిన నా మనస్సు భీతిచే గలఁగును. రేలు నిద్ర రాదు. యుద్ధమున నతినిని మార్గొని నవాఁ డమెుసు లేఁడు. అతఁ డెలుకతో నె త్తిన గిద కాలగండము. చిఱుతనాఁడును వాఁడు నా యాజ్ఞ నను సరించినవాఁడు కాఁడు. పిరు వైరసుత్తి కలహించుచుండురు. పేదఁ బడియును మానరు. ఈ భేదమున కెల్లఁ గారణ మదియ గాదె ? మదముకతన నెదిరినిఁ దమ్మునా నెఱుఁగరుగాని ప్రళయకాలసముద్రుని భంగి పొంగు భీముని గడచుటకును, నాఁపుటకును నా పుత్రులకు వశమె ?

"భీమార్జునుల కొలఁగులు భీష్మద్రోణులకంటె నెవ్వరెఱుఁగుదురు ? ఎట్టిగియు మానుషము వాటించి సేనమొగమున నిలుతురు.

కీర్తికొఱకై ప్రాణములు విడుతురు—ఇంతియ కాని చేయునది లేదు. అదియునుం గాక పౌత్రులగుటయు శిష్యులగుటయు గాంగేయునకును గురునకును సామాన్యంబగుటం జేసి రెండు తెఱంగుల వారికి నీ రొక రూపు. మనకడ నున్న తప్పునకు మన ముందట నిలువవలయు నను నింత మాత్రమునకుం గా వీరల కింత వలసె. నేను దైవాసీసిత కతమున బిడ్డల నొత్తిచెప్పను. నియమింపను జాలను. మొదల విదురుండు చెప్పినట్ల వాటిల్లెను. జూదము నాంటనుండియుం గురుజాతికిం జేటు మూఁడుట దోఁచుచుండెను. మందబుద్ధియు, లోభోపహతుండును నయి దురభిలాషమున దుర్యోధనుం డింతచేసె. కాలవిపర్యయమునం గౌరవులకుం గడవరాని యవస్థ వచ్చెను—సంజయా! నేనేమి చేయుదును? ఎందుం జొత్తును? ఎద్ది తెఱువు? ఎవ్వగు కరణము?

"కావున పాండవులతోడి భండనమునం గులక్షయమగుట తప్పదు. శాంతిం బొందుటయు మేలు. మనవారల కిది ప్రియముగ బగునేని దానికిం దగిన యత్నము చేసెదను."

అనిన విని ధృతరాష్ట్రునకు సంజయు డిట్లనియె:

"దేవర యానతి యిచ్చిన యీ మాట కడు లెస్స. నాఁడు నీ వుపేక్షించి పోవిడిచితివి. ఇప్పుడైనను మించినది లేదు. పాండవులు నీ చేతికి వత్తురు. వారు కౌరవుల చేటున కొప్పుదురే? వారు దిగ్విజయ మొనర్చియు ధరారాజ్యమును మీ కిచ్చి పోలేదే? అరణ్యవాసా యాసముం బడియు రారాజును చెఱనుండి విడిపింప లేదే? అట్టి

యెంత నైనను లాలించి తగవ్రస్సై సంభావింపవైతివి కాని నాఁడే పాండవు లలుక విడువరే? వారు నీ మాటకు మిగులుదురే? ఇప్పుడైనను వారినిఁ బిలిచి వారి భాగమును వారి కిమ్ము."

అనిన విని దుర్యోధనుఁ డంత్రి కిట్లనియె:

"అడవులను గొండలను బడి మహాపద లొంది శౌర్యమును గోల్పడి యున్న వారినిఁ గొనివచ్చి కృష్ణుఁ డాకస్త్రీవృగ కూటనవమూఁకను గూర్చినంతో మాత్రమునఁ బాండవులు నెగిరి మొత్తురా? రాజా! మొంగాల కింత భీతి? నాకు కడిమి కలు లున్నను నీ నసహగా గణింపకుము. ఎవ్వరియైనను మేము గెల్తుము.

దుర్యోధనుని మాటలు

"పరసు రాముని గెలిచిన బ్రహ్మచారి భీష్ముఁడు. ఇతని పేరు విని యమునీసులు పారిపోవుట నీ వెఱుఁగవే? ఇతఁ డలిగనేని పాండుపుత్త్రుల నెంత? కృపుఁడును గురుఁడును నయోనిజులు; అపరిమిత భుజాబలాఢ్యులు. ఆహవ కేళీ నిపుణులు; అజేయులు. వీరలు కపితొత్తుమైన హెరుఁడైనను వీరిని మారొడ్డునే?

"అశ్వత్థామ జనితుఁడును, మహాదశ్వప్రతిమాన తేజుఁడును, సర్వకళానిస్త్రైశ్వర్యానుసంధానుఁడును నగు నశ్వత్థామ గలుగ మనకు యుద్ధమున వెఱపేల?

"సహజ కుండలుఁడును, శౌర్యధుర్యుఁడును, సముదీర్ఘబాహు

బలుఁడును నగు కర్ణుఁడు మా పక్షమున నున్నాఁడు. ధర్మజు పక్షమున నితనికి సమాను నొకని చూపుము.

"నరేంద్రా! కర్ణుని పెంపు వినుము. మహేంద్రుఁడు వచ్చి శచికై తన్నర్థింప గుండలముల నితఁ డిచ్చుట లోకవిశ్రుతము గాదె!

"ఇట్లు మన పక్షపు వీరులు ధర్మపుత్రాదులకే కాక—ఎవ్వరికిని నజేయులగుట తెల్లము. బాహ్లీక, సోమదత్త, భూరిశ్రవ, శల్య, సింధురాజ, గాంధారరాజ ప్రభృతి మహాయోధులు వారలకంటె శక్తి సమగ్రులు. తక్కిన రాజలోకమును, సహాయులై వచ్చిన వివిధ దేశాధీశులును నాతోడి సుఖదుఃఖముల కియ్యకొని, యుగ్రాగ్నినైన నగ్గినైన నుఱుకను, సముద్రంబైన నీఁదనుఁ దెంపుచేసి ఱంపెదఁగోరు చున్నవారు—కావునఁ బాండవులకు మాందెస దేశేశులనుఁ గొలఁది గాదు. అనుమానింపకుము. ఇట్లుఁ గాక నిట నెవ్వరును లేక, చుట్టములును జెలులును విడిచి, తోడువచ్చినవారును విడ్చిపోఁగ, భృత్యులును విరక్తులై యుంట మాకును, నట పోటుమానిసులును, బంధు మిత్త్ర సహాయులును, ప్రజానురాగమును గలుగుట వారికిని నైన నది ప్రాప్తకాలము. ఇంతియ కాని మే మింక వారి యాఁగు లొత్తనుఁ బాఱిపోవనుఁ జాలము. ఎల్లభంగుల సమరము సేయుదుము. తలపెట్టిన నా తలఁచిన ట్లౌంగా, వాసుదేవుఁడు దలఁచిన ట్లౌంగా నయ్యెడు—ఎట్లైనను మేలె. ఇది నిర్ణయము."

అని పలికి, మఱియు నిట్లనియె :

"కులములోఁ దలవంపగు కూడు గుడుపఁ గంపఁ జూచెదవు. పగతురు పైనెత్తి వచ్చిన 'పోరికి నోపను' అని చెప్పుట పిఱికితనము గాని పొందుగాదు.

"నీవు కౌరవకుల చూడామణివై పరువునను భయపడి, యీ విధమున నావిడిచి పోవుచిన నను లేవఁజాలరె? ని న్నేమందును?

"భీమసేనుని సింహనాదము విని పెనుభయంబులఁ గొన్నతివి. 'అతఁడు బలవంతుఁడు, గదయందు నేర్పరి' అని యెంతయు బెదరెదవు. సరవారేణ్యా! అతఁడు నన్నుఁ బోలిన రౌతుఁగనవే? గదాయుద్ధమున నాతో సరి గురు మున్ను గాని యితరులగాను లేఁడు. చలమెత్తి యుద్ధరంగమున భీముఁడు నన్ను యుద్ధమున నెదుర్కొనుచో వజ్రప్రహారమునఁ గూలు పర్వతమువలె భూమిపైఁ గూలఁ ద్రోసెదను పెద్దకాలమునకు గదారణము వచ్చెను. నా కోరిక యీడేరెను. భీముఁడు పడిన తర్వాత పాండవసేనల నడిపించువాఁ డొక్కఁడును లేకపోవుట సిద్ధము ఇది యంతయు నెఱిఁగి వెఱచి యేల 'ఏ దూర్జ్ఞననుడమకుఁ జాలును' అని ధర్మనందనుఁ డడిగెను.

"అర్జునుఁ డున్నాఁడని తలఁచితివేమో. కృష్ణుని శక్తిముందఱ నిలిచి నగనారు ప్రతిదినవచ్చునా? అదియుఁ గాక యతనిని భీష్మాది రథికుల యాతులకేగను దివ్యబాణములు పొంగిపోనవె?

"సంశప్తకుల గుమ్మ్యసూ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదు లగు నీ కొడుకు ఖండింపకపోరు జగములెల్ల జయింపఁజాలుదురు.

అందఱు నొక్కమొగమై త్రోచి నడచిన సవ్యసాచికి నొకఁ నిలువఁగాఁడు, పాండవుల నెల్ల నొక్కటిగా వైచికొననోపుదురు. అట్లునుఁగాక మా బలములు పదునొక్క యక్షౌహిణులు. వారి బలము లేడక్షౌహిణులు మాత్రము. మా సైన్యము సారవంతము. వారి బలము నిస్సారము. వారు మమ్మెవ్విధమున జయింప నోపుదురు? ఈ మొక్కవడక్కవలు విచారింపక పలవని వెఱపు గట్టికొని ముకుళించి వగచుచున్న వాఁడవు. నిన్ను వగవకుండ నుపపుచ్చలము. అంతియ కాని తక్కిన పనులకు జాలుదుము." అని పలికి, సంజయుదెసఁ గనుఁగొని సుయోధనుఁ డిట్లనియె:

"అయ్యనుసూనుఁడు సమత్సరబుద్ధితో నానాదేశముల పెద్ద మనుష్యులను గూర్చికొని యేమనెనో చెప్పుము; చూతము."

అనిన విని సంజయుఁ డిట్లనియె:

"ధర్మరాజుఁడు భండనమనిన సంతసమున మూరెడు పెరుగును. అతని తమ్ములును పెండ్లికి పోవుచున్నవారివలె నున్నారు. అందఱి నాయకులు తమ భుజకండూతి యెప్పుడు వదలునా యని యాతురత పడుచున్నారు. నరుని పాశుపతాది బాణముల పెంపును, భీముని గదాకౌశలమును నమ్మి యక్కడి బలము భయమూడిగి కయ్యమునకుఁ గాలుఁ ద్రవ్వుచున్నారు."

అనఁగా దుర్యోధనుఁడు:

"సంజయా! నీవు కౌంతేయుల కైవారము చేసెదవు. ఇం

రేయే రణసాధనములు గైకొని కౌరవులపై నెఱవక పైకొన జూచుచున్నారు ?"

అనిన సుయోధనునకు సూతనందనుఁ డర్జును దివ్యరథ శ్వేతాశ్వ కపిధ్వజ దేవదత్తముల సహానుభావములు వేఱువేఱ వర్ణించి చెప్పి, యుధిష్ఠిర భీమ నకుల సహదేవుల యరదములు, తురంగాది పరికరము లిట్టిట్టివని యేర్పడఁ బలికి, విరాట ద్రుపదాదులకు వలయు నుపకరణములు కొఱఁతలే మియు నెఱిఁగించిన,— ధృతరాష్ట్రుఁడు, "ఇందుఁ గల బలుమానిసు లెవ్వరికి సమాధ్యులు. వీరి సాధించు తెఱఁ గూహించిరే?" అని యడిగిన సతనికి సంజయుఁడి ట్లనియె:

"గంగాసుతుఁడు శిఖండిపా లనియు, నతనికి మత్స్యేశ్వరుబలము ప్రాపనియు, ద్రోణుఁడు ధృష్టద్యుమ్ను పాలనియు నతనికిఁ దోడు ద్రౌపదేయులనియు, రారాజును నతని తమ్ములును మారుతి పాలనియు, కుమారు లభిమన్యు పాలనియు, శకుని సైంధవులును, అశ్వత్థామను కర్ణులును సవ్యసాచి పాలనియు, కృతవర్మ సాత్యకి పాలనియు, సోమదత్తుఁడు చేకితానుని పాలనియు సచ్చట నిశ్చయించుకొనిరి. నకుల సహదేవులు నుయూకాది సుతులను, సార స్వతులను, కాళింగకులను శిసుయింతురట. ధర్మరాజు శల్యుని గెలుచునట.

"అట్టి పలుకుల సమయమున నచ్చటి జనులు కొందరు ధర్మనందను నుద్దేశించి:

'ఇతఁ డెక్కడ? శల్యుఁ డెక్కడ? ఇతని కతఁడు పాటియె?' అనిరి. దానికి నేను శల్యుని యతి బల శౌర్యములు వారికిఁ జెప్పితిని.

"ఇంతయ కాక యుద్ధమున నెవ్వ రెవ్వరి కెదురు పడినను వారితో వారు పోర నిశ్చయించుకొనిరి. ఇంక నీ కొడుకులకును నీకును నెయ్యది కర్జంబని తోఁచిన నది చేయుఁడు."

అనిన విచిత్రవీర్యతనయుఁ డిట్లనియె:

నా కొడుకుల కింకెక్కడి బ్రతుకు? యుధిష్ఠిరుఁడు రాజై హరి యతనికి జయ మొసఁగూర్ప నుంకించిన, నవ్వారి సైన్యమును వారా జీవితముగ నరకుసేయకుండుట నా జన్మము దుఃఖభాజనమగు టయే సుమీ! ఇక్కడ కూడిన భూపతుల కిది యంత్యకాలము దాపురించినది. నాకు వీరిని మాన్చుట కేల సాధ్యమగును? నీ కీ వగ పేల? ఇంక మాటలు నిలుపుము."

అనిన విని దుర్యోధనుఁడు నిజజనకునితో నిట్లనియె:

"మేమును పాండునందనులును నేకకులమునఁ బుట్టి యొక్క చోటనే వర్తించిన వారము. అట్టియెడ శౌర్యబలదర్పములు వారికే కల్గి వారే సంగ్రామమున జయింతు రన్న నిశ్చయ మెట్లు గల్గెను?

"పాండవులను, వారి వారిని నిట్లు వర్ణన చేయుదువు గాని మమ్మును మా వారిని దలఁపవు. మేము రాజ్యము చేయుటయు,

వారు రాజ్యభ్రష్టులగుటయు విధి నిర్ణీతము. దీని నెవ్వరును మాన్ప
జాలరు. అకారణముగ దుఃఖించు టేల ?"

అనిన విని సూతనందనునకు నంబికానందనుఁడిట్లను : "నా కొడుకు
కున్మత్తప్రలాపములు చేయుచున్నవాఁడు. ఇంతియ కాని సత్య ధర్మ
నయ పరాక్రమ సహాయ సంపన్నులైన పాండవులను గెలువ
సాధ్యమే ? తాను ప్రబలుఁడయినను యుద్ధము కీడౌకాక మేలగునే ?
అది యట్లుండె. ఒక్కటి యడిగెదను చెప్పుము.

"సంజయా ! సమరమునకుఁ బురికొల్పుచు, మమ్ముఁదలఁచి
నంతనె యుద్రిక్తమ్ము మాటలచే వారి చిత్తము లుడికించుచు పాండవు
లను యుద్ధసన్నద్ధులను గావించుచున్నవా రెవరో సుమా ?"

అనిన సంజయుఁ డిట్లను :

"దేవా ! పాండవుల యలుకను ధృష్టద్యుమ్నుఁ డేపారపుమాట
ల్లనను నేయిపోసిన భగ్గుమనునట్లు నిగుడఁజేయును. అతఁడు ధర్మ
తనయునితో : 'గాంగేయ కుంభసంభవాది మహావీర క్రూర
సత్త్వ బహుళమును, కరిఘటా గిరికదంబ కలితమును, తురంగనికర
తరంగపరంపరా ఘోరమును నగు కౌరవసేనా సముద్రమునకు నే
నొక చెలియలికట్టనై నిలిచెదను.' అనగా యుధిష్ఠిరుఁడు 'నీ వింతకుఁ
జాలుట యెవ్వ రెఱుఁగరు ? ఎట్లును సంగరమున మ మ్ముద్ధరిం
పుము." అనెను. ఇట్లు గొనియాడిన నాతఁడు నాదెస గనుఁగొని :
'సంజయా! మీ వారల కెల్లనుఁ దెలియఁ జెప్పుము. ఈశ్వరాది దేవ

తలు కూర్చిన సవరణ గల యగస్త్రముచేత నిర్జింపఁబడిన యుత్కృష్ట
జాతు లనేకు లుండుట యెఱుఁగుదురుకదా? మనుష్యు లలని ఎంత
పెద్దా? ఇట్టి ఱెట్టి వెన్నుదన్ని చూడఁగలవాఁడు గావున మనముకొం
ట్లల్లఁ బోక పెనఁగినచోఁ బోరు ఘోరంబగు. తదాన్వేత ప్రాణములపై
వచ్చు. అంతకంటెను బరమదయాపరుఁడైన పాండవాగ్రజు మఱుఁగు
చొచ్చి బ్రదుకుఁ డనుము. అంతలంతలు దప్పులు చేసితిమని తలంక
వలవదు. ఎంత చేసినను కౌంతేయపూర్వజుఁడు శాంతిసుధానిధి
యగుటఁ జేసి, శరణు జొచ్చిన గాచును' అని పలికెను"

ధృతరాష్ట్ర వచనములు

అనిన విని ధృతరాష్ట్రుఁడు దుర్యోధనున కిట్లనియె:
"నీకును పరిజనులకును సగము రాజ్యము చాలును.
తక్కటి సగమును పాండవులకిచ్చి నిశ్చింతతోఁ బ్రదుకుము.

"యుద్ధము నాకె కాదు. మన పెద్దల కెవ్వరికిని నియ్యకోలు
గాదు. యుద్ధ మనుచిత మగుటచే గురుడాది బంధుమిత్రులు పోరి
కియ్యకొనరు. ధర్మపుత్త్రుఁ డకుంఠిత తేజుఁడు. ఆతనితోఁ గూడి బ్రతు
కుట కౌరవజాతి కంతటికిని గౌరవప్రదము. కష్టము లేచి పెట్టఁగ,
దుర్ణయపరులైన శకుని దుశ్శాసను లీ నిర్ణయమే మేలనఁగ నీ కర్ణ
ముల కీ మాటలెల్ల రుచించును?"

సుయోధనుని నిశ్చయము

అనినఁ గటకటంబడి సుయోధనుఁ డిట్లనియె:
"నీవు చెప్పెడి పెద్దలు ద్రోణాచార్యులు మొద
లైనవారు యుద్ధమున కొల్లని శక్తిహీనులైనచో వారిని
డోవియా నేను పాండవుల నెదుర్కొనునది. రాధేయుఁడును దుస్స

సేనుఁడను యుద్ధమునఁ బ్రాపుగాఁ బాండవక్రోధజ్వాలల నార్పను గాని యొండొకని సహాయము సల్పింతునే ? నన్నింక బాధపెట్టకుము. వాఁడిసూదిమొన మోపజాలునంత భూమినైన నే నీయను."

ధృతరాష్ట్ర దుర్యోధన సంవాదము

అనిన గాంధారీవల్లభుఁ డతని కిట్లనియె :

"నీకొఱ కింతగా వగవను. నీ పోవు తెరువునఁ బోవనున్న వారికై వగచుచున్నాను. యుద్ధము వలదు. మత్సరము మాని శాంతుఁడవు కమ్ము."

అని పలికి యతని వలనఁ బలుకు గానక, మనము మరలం బెట్టుకొని, కొడుకులు జయింప నోపుదురా యను నాస, సంజయు దిక్కు మొగము చేసి, పాండవ కౌరవపక్షములఁ గలవారి నడుగుచు, కొలఁదులు తలపోయుచు, సంజయుని వచనములను, తన విచారమునను బలాబలములు నిశ్చయించి పొంతచేయ లెక్కఁడగుట యెఱుఁగుచుఁ, గ్రన్నన నా సూతపుత్రుతో లెక్కలు పెట్టుచు, పోలించుచు పెన్నప్పిగ్గ వివరించి, కౌంతేయుల శక్తి దేవశక్తిగను, గాంధారేయుల శక్తి మానుషశక్తిగా దెలిసినవాఁడై, యంబికానందనుఁడు నిజనందనునితో నిట్లనియె :

"నరుఁ డగ్నిదేవు నారాధించి కేతుస్స్ఫురణమాది సంగరపరికరములను బొందినాఁడు. అదియునుఁ గాక ధర్మదేవతయు, వాయుదేవుఁడును, వాసవుఁడును నాశ్వినులును వారలకుఁ బాండురాజు తోడి వారలు. వారి కొరకు కీడునుఁ బొరయకుండ రక్షింతురు. కావున భీష్మ ద్రోణ ప్రముఖులకుఁ బాండవులను పరిభవింపరాదని తెల్లము.

"దేవత లేటికి? పార్థుఁడు దేవసముఁడు గాఁడె? వాఁడు దివిజులచేత నోడింపబడని దైత్యులను జంపడె? నీవును నీవారును నతని నెఱుఁగరె?

"కౌరవులకు వచ్చిన యిస్మహాభయమునకుఁ బ్రతీకారము శాంతిని గడచునది కాదు. ఎన్నిభంగులఁ జూచినఁ గయ్యం బుడుగుటయు మనకుఁ గర్తవ్యమై యున్నది. ఉపశమింపవయ్యా. దీర్ఘస్వరము వలదు.

అనినఁ దండ్రికిఁ గొడు కిట్లనియె:

"దేవత లర్జునునకుఁ దోడై వత్తు రనవలదు. ఏలయన దేవత్వము రాగద్వేషావేశము లేనిది కాదె? కావున వా రొకళ్ల వారు గారు. అట్లు గాక పక్షపాతులై పూనివత్తురేని యది దేవత్వము గాదు. అట్టి దేవత్వమున నర్జునుఁడు సురక్షితుఁడు గానేరఁడు. నీవు నాపనికిఁ జింతవలదు" అని పలికి వెండియు నిట్లను: "పెటిగివచ్చు కార్చిచ్చు నడుపను, పాషాణవర్షమును వారింపను, మహావాయువు నిలుపను, నీళ్లు గట్టిగా నభిమంత్రించి వానిపైఁ గరితురగాదుల నడిపింపను, నాసేన నడచునప్పుడు వలసినచోట జలము నుత్పాదింపను జాలుదును. సింహ శరభ శార్దూల భూతభేతాళాది క్రూరసత్త్వ సంరంభ స్తంభన ప్రకారముల నెఱుఁగుదును. మిత్త్ర శత్త్రు విషయంబులైన శుభాశుభములు వలయుభంగి నావహింప నేర్తును. మఱియు నానావిధ సిద్ధిప్రదములగు మంత్ర ధ్యానానుష్ఠానముల నాకుఁ

గొఱంత లేదు. నీ చెప్పిన యగ్నిప్రముఖదేవతలును బ్రసన్నులగున ట్లుగా నారాధించినవాఁడను. వారికి నాకువలె మహానుభావము కలిగినఁ బదమూఁడు వత్సరము లట్లిడుములఁ బడుదురె? వినుము చెప్పెదను.

"నే నలిగిన వారిని సురలైనను రక్షింపనోపరు. నేను బూనితినా యమరు లలిగినను వారిని కాతును. మానవులు నాకొక లక్ష్యమె?

"ఇవి గర్వమున నాడు మాటలుగాఁ దలఁపవలదు. ఇదియంతయు సత్యము—నన్ను నే నెన్నఁడైనఁ జెప్పించుకొందునే? ఆత్మసంస్తుతి పౌరుషమే?

"ధర్మతనయాది పాండవేయులును, ద్రుపదాది పాంచాలురును, విరాటాది మాత్స్యులును, వాసుదేవాది యాదవులును, కేకయ పాండ్య మాగధ చైద్య ప్రముఖ నిఖిల దండనాయకులును, నా బారిఁ బడి మున్నీరుసొచ్చిన యేఱుగుచందమున నడఁగిపోవుట యవధరించెదవుగాక. వారెల్లరును దేజోధైర్యపరాక్రమోపాయ విచారవివేకముల నాయెత్తువత్తురె? పితామహద్రోణకృపాశ్వత్థామలు శస్త్రాస్త్ర విషయములుగా నేమిని యెఱుఁగుదురో, యెంతెంత నేర్తురో, యవియెల్ల నెఱుఁగుదును, అంతయు నేర్తును." అనిపలికి యందఱు వెఱఁగుపడి యుండఁ దాను సంజయుతో సంగరము తెఱఁగు నాలోచనముగాఁ బాండవులదెస మాటలాడుచుండఁ, గర్ణుఁడు ధృతరాష్ట్రుని గైకొనక ధార్తరాష్ట్రునకుఁ బ్రియముగా నిట్లనియె:

"గురుని యాలుకను నాశస్త్రస్ఫురణము చెడెనని జనులందురు. అది కల్ల, అమ్మునీశ్వరు కరుణబడస మరల ప్రీతిఁబడయ గాంచితిని. కావున నస్త్రశస్త్రముల ఖండిత సంపద నొంది యుండ దేవావళికైన నన్నుఁ జెనయ నసాధ్యము. నే నుండగా మేదిని నర్జునుఁడా విడిపించువాఁడు? నీవును మన బలము లును మెచ్చఁగా యుద్ధమున నిల్చెదను. పాండవులను గెల్చెదను.

కర్ణ వాక్యములు

"గాంగేయాదులు నీకడ నిల్చి వేడ్కఁ జూడఁగా సర్వసేనాం గములమీఁదను గాలియుఁ జిట్కాడనీక పాండవులను దాఁకి యుద్ధ మున గ్రీడించెదను."

గాంగేయు హితము

అనిన విని యినసందనునకు మందాకినీ నందనుఁ డిట్లనియె:

"కాలుఁడు ప్రేరేపింపగా నీవిట్లు ప్రేలుచున్నావు. నీ మాటలు విని నీవు దొడ్డవాఁడవని మేము తలఁపము—— ఇంక చాలింపుము. సర్వకార్యములను సాధింప నీవ చాలుదువు!

"పాండవులు కూలువారా? యుద్ధమున నీవు చెప్పిన మొన గాండ్రెందఱను ముందు చావఁగా, క్రమమున సేనలన్నియుఁ గూలఁగా, కౌరవులు పిదపఁ నశింతురు. ఇంతియేకాని నోరిచేఁతేల? వృథాభిమానమున నేల ప్రేలెదవు?

"దివిజపతి నీకిచ్చిన తీవ్రశక్తిచేఁ గవ్వడిపడునని జూతువేని వాసుదేవునిచే నది వ్రయ్యలై, తునియలై, పొడిమై ధరణిఁబడును.

సర్వముఖ శరముగలదను దర్పమున నర్జును నెదుర్కొన నెంచకుము.
అట్టివాని నెన్నిటినైనఁ జరకుఁ బెట్టి శ్రీకృష్ణుఁ డర్జునుని రక్షించును."

అని పలికి ధృతరాష్ట్రునితో నిట్లనియె :

"రాజా ! జ్ఞాతులు దమలో నొద్దిక గలిగియున్నచో కలసి
మెలసి పెంపున నుండుదురు. ఆయొద్దిక చెడినచోఁ బేదఱికమునఁ
గొఱవికట్టెలవలె నొకరినొకరు చూచి మండుచు రాజుచు నుందురు.
గావునఁ దమలో విరోధమొప్పదు. సంభాషణ సహభోజనాది
సత్కారములను సవినయవర్తనములను బ్రీతులైన జ్ఞాతులిహపరార్థ
సాధకులగుదురు", అని చెప్పి మఱియు :

"అవినీతులైన నీకొడుకులు పుడమిఁగొల్లను దారయేలుదుమని
చూచెదరుగాని తమ పొలివోవుటఁ గానరు. వీర లర్జునునితోడఁ
బెనఁగి మానప్రాణములు దక్కించుకొనువారే? అట్లుగాక సమబలు
లైనను గయ్యమునఁగడా నీకొడుకు వారోడు రనవచ్చును. అది
యేల? నీ లోనికి ధర్మనందనునిఁ దెచ్చుకొనుటయు నీకుఁ గర్తవ్యము."

అనిన బాహ్లికుఁడు ధార్తరాష్ట్రున కిట్లనియె :

"కనుబ్రమసిన తెరువరి తన కనపాయమైన మార్గమరసి తెలి
సినవారు చెప్పఁగా గ్రహింపకయున్న చొప్పున నీవు తగుమార్గము
నకుఁ బోకున్నవాఁడవు."

అనిన వైచిత్ర్యవీర్యుఁడు దుర్యోధనున కిట్లనియె :

"కుమారా! నేను నీకెట్టులో యటులనే బాహ్లికుఁడు నీకుం గూర్చువాఁడు. వీరి మాట వినుము. మేము ముస్స్వరమును నీకుఁ బూజ్యులముగాని యన్యులము గాము గదా! అట్లుండియు నేనే నిన్నుఁ బ్రార్థించెదను. ధర్మజుఁడు వైరము పెట్టుకొన దగినవాఁడుకాఁడు. పాండవులకు భూభాగమిచ్చివేయుము."

తుదిరంగము.

అని చెప్పి మఱియును గొడుకు సమ్మతింపక పోవుటచే మిక్కిలి కినిసి కొలువున నున్న వారలందఱు విన నిట్లనియె :

"నాఁడు విప్వాచ్చుఁ డొంటరిగఁ బసువులను మరలించుకొని పోవునపుడు నీసేన యోడిపో లేదా? నీవును గర్ణుఁడును నచట లేరా?"

అని రాధేయు దిక్కుమొగమై మఱియు నిట్లనెను :

"ఇప్పు డప్పటివలెఁ గాదు. నారాయణుఁడు నాగలెక్క, ప్రక్కన భీముఁ డేచి నడువఁగా ననుజ తనుజ సహితుఁడై వచ్చు విప్వాచ్చుని మనకు మార్కొనవశమె? నీవు పాండవులను మార్కొన బూనుట సాహసము. మత్సరమున సుయోధనుని చావునకేనియు నిష్టపడుచున్నావు."

అనిన విని కానీనుఁడు సంక్షుభితమానసుఁడై యిట్లను: "ఇది యెల్ల నిట్లయ్యె. నదీసూనుఁడు నన్ను నిరాకరించి పలికిన పలుకుల ఫలం బనుభవించుఁగాక." యని యతని నుద్దేశించి యిట్లనియె:

"నీకు యుద్ధమున నాలావు తోడ్పాటు లేక యుండవలెను. నీ తెగునంతవఱకు యుద్ధమున నిలువను. ఆయుధములను విడిచితిని. నీవు పడినపిమ్మట నాబలవిక్రమములను జూపెదను."

కర్ణ ప్రతిజ్ఞ

అని యస్త్రసన్యాసము సేసి కొలువున నిలువ నొల్లక దిగ్గున లేచిపోయెను. అట్టి యెడ శాంతనవుఁడు నవ్వుచు దుర్యోధనున కిట్లనియె :

"కర్ణుఁ డంతకును జాలఁడా? వాగ్దానముచేసి యింతకు మున్నెన్నఁడును బొంకఁడు! ఇంతటి మానిసి యలిగినచోఁ బాండవు లింకెట్లు బ్రతుకుదురు?

"అదియుఁగాక యాతని మాటలను నమ్మి నీవు ధర్మతనయునితో నైన్నైనను యుద్ధమునకుఁ బూనుకొందువు. నేను బాహ్లిక ద్రోణ ప్రముఖులుఁ గనుఁగొనుచుండఁ బ్రతివీరుల ననేక సహస్రములను సమయించెదను. పిదప రాధేయు గణమును జూచెదవు గాక!"

అనిన విని దుర్యోధనుఁడు గర్ణపక్షపాతియు నవినీతుఁడును నగుటఁజేసి సహింపక పితామహునితో నిట్లనియె :

"ఎఱిఁగియో యెఱుఁగకయో మీరెప్పుడును 'పాండవులే గెల్తురు' అని చెప్పుదురు. నిన్నును ద్రోణకృపులను నమ్మి నేను యుద్ధమునకు దిగుటలేదు. నా బలపరాక్రమములే నాకుఁ జాలును. కర్ణుఁడును దుస్ససేనుఁడును గల్గ నా కొఱు లేల? మేము శత్రువు నోడింపజాలుదుము. నీతిచేనైనను నవినీతిచేనైనను తుదకు మాకే యీసమస్తభూమియుఁ దక్కును—"

అని దుర్యోధనుఁడు పలుకుటయు ధృతరాష్ట్రవిభుఁడు దన నందను నేమనియుఁ జెప్పఁజాలక వెనుఁబాటున విదురునితో నిట్లనియె:

“నాతనూజుఁడు మృత్యుపాశోపహతుఁడయ్యెను. కర్ణునిఁగూడి యతఁడు నాశముఁ బొందువాఁడు. ఇంక మన మేమి చేయవచ్చును?”

అనిన విని విదురుఁ డిట్లను:

“మనవారలు మున్ను దుర్బలులు. తమలో దాము బెనఁగుచు నిరసనవచనము లాడుచు వింతలు పుట్టించుట యిది యర్జునకుఁ గార్య మనుకూలింపఁజేయును. కాక యేమనువారము? అక్కడ బంధుమిత్రసహాయులును వారును నొక్క తలంపువారై యున్నారు. వలవని యీ వెంగలి మాటలు విడిచి పాండవులను బిలువఁబంచి తగవువడుపుటదక్క మనకుఁ జేయఁదగుపని వేఱొండు గలుగునే?”
అని చెప్పిన ధృతరాష్ట్రుఁడు సంజయుఁడు చెప్పిన కార్యవచనముల కొంత వినఁగలవాఁడై యతని దిక్కు మొగముచేసి:

ధృతరాష్ట్ర సంజయ సంభాషణము.

“అర్జునుఁడు ముందు తలఁచునదియన్నియు నీకు జెప్పి నన్ను భీతుఁగొల్పునట్టి దేమి చెప్పెనో చెప్పుము.”

అని యడిగిన సంజయుఁ డిట్లనును:

“నరేంద్రా! పార్థుఁడు తుదినిశ్చయముచేసి సుయోధనునితో నిందలి పెద్దలు వినఁగా ననుమన్న పలుకులు వినుము;

"కురువంశోత్తముఁడైన ధర్మజుఁడు 'నాతండ్రి పాలురాజ్యములో నగమిమ్మ'ని యడుగఁగా వినియు దర్పముచే నియ్యక తక్కిరేని జటులమైన యస్మదీయ విశిఖాగ్ని జ్వాలలందు పడునగా వారిని మైశ్వర్యముతోఁ బొటుగ నాహుతి పెట్టుదును'

"అని పలికి కౌఁగిలించుకొని భూషణాంబరాది కమనీయ వస్తువు లొసఁగి నేనునుఁ బాండవులను వాసుదేవుని సవినయముగ వీడ్కొని యింతవట్టును దేవరకు నెఱింగింప వేగంబ వచ్చితిని."

అనిన సమ్మాటలు దుర్యోధనుఁ డాదరింపక పెడచెవులఁ బెట్టెను. ధృతరాష్ట్రుఁడును రిచ్చవడి యూరకుండెను. అప్పుడయ్యిరు వురి పాలును సంజయుఁడొక్కఁడుతక్క నయ్యాస్థానమునసున్న సమస్త జనములును దిగ్గన లేచి తమతమ నివాసములకుఁ బోయిరి. తదనంతరము తనుజవశవర్తి యగు సమ్మాను జేంగ్గుడు తన సుతుఁడు యుద్ధమున పాండవుల మర్దింపఁగ నోపునో యనుసుశాళచే సంజయునితో నిట్లనియె:

"సంజయా! నీ వీ రెండు పక్షముల తారతమ్యముల నెఱుంగుదువు. పోరైన నెవ్వరోర్తురు. ఇది నిశ్చయింతువా? ఏపక్షమున నుపాయమునుఁ బౌరుషమును గలవారు కలరు? చెప్పుము."

అనిన సూతనందనుడు:

"నన్నడిగెద వేని నీ యయ్య సాత్యవతేయు నిటకు రప్పింపుము. గాంధారీదేవిని బిలువఁ బంపుము. వారు సునీతి రతులు.

నిశ్చయవిదులు. ధర్మజ్ఞులు. నీకుల్లమున నసూయాహ లొదవేని వానిని మాన్పఁగా వారు నేర్తురు."

అనిన విని యంబికా నందనుఁ డట్లగాక యని యొక కంచుకిఁ బిలిచి వానిఁ బుచ్చి గాంధారిని రావించెను. పిమ్మట నాతఁడు సద్భక్తితాత్పర్యములఁ గృష్ణద్వైపాయనమహా మునిఁ దలఁచిన దివ్యయోగమహిమయుపైన యమ్మహాత్ముఁడు విజయము చేసెను. అందఱు దండప్రణామములు చేసి సమున్నతాసనమున నుంచి యర్ఘ్యపాద్యాది విధులఁ బూజించి యున్న సమయమున, ధృతరాష్ట్రుఁడు విన్నపము చేయక యున్న నమ్మహాపురుషుఁడు ధృతరాష్ట్ర సంజయుల చిత్తవృత్తులు మున్నె యెఱిఁగినవాఁడగుటఁ జేసి, సంజయు దిక్కు ప్రసన్నదృష్టి సవలోకించి యతని కిట్లనియె:

గాంధారీ వ్యాసుల రాక

"నీవు సమస్తము నెఱుఁగుదువు. కావున నీవూరకుండఁ దగదు. భూవిభుఁ డడిగిన పని యీవిధమని నేను వినునట్లు తెలియఁ జెప్పుము."

అనినఁ బ్రసాదమని సంజయుఁడు ధృతరాష్ట్రున కిట్లనియె:

"నరేశ్వరా! ఆసేనకు నీసేనకు నీవు వాసి యడిగెదవు. ఆ సేనయందు వాసుదేవుఁడు గలఁడు. నీసేనలో నతనికి సమానుఁడైన వానినిఁ జూపుము. వాసుదేవుఁ డెట్టి వాఁడని యడిగెదేని చెప్పెదను వినుము: జగముల నన్నిఁటిని వశపరచుకొనిన బాణాసురుని నొక్క గడియలో గర్వముడుఁచెను. సురేంద్రుని కల్పకమును మిక్కిలి చులకన

గాఁ దెచ్చెను. హరి పరాక్రమ మప్రసిద్ధమే? అధిక దుష్కరము లైన కార్యములను నైతము కృష్ణుఁడు క్రీడవలెఁ జేయును. పూర్వభవ సఖుఁడగుటచే నతఁ డేకాస్థుఁడై పార్థు నెనసియుండును. అట్టి వాసుదేవుని చక్రము నిజమాయా బలమునఁ బాండవుల సర్వ సమర సాధనముల యందును సూక్ష్మరూపియై నిలిచి వారికి విజయ మొసఁగుచుండును." అని చెప్పి మఱియు నిట్లనియె:

"పలుమఱు పాండుతనూజుల కొలఁది వితర్కించెదవు. అది నిగూఢము. రాజా! పాండవుల బలమును సత్త్వమును హరియే సుమ్ము.

"హరిమహత్త్వము విన్నవించెద నవధరింపుము. ఒకతల సమస్తజనములును నొకవైపు జనార్దనుఁడును నిలిచి యొక తలయైన

హరి మహత్త్వము

సకలమును నసారమగును. అతని బల మొక్కటియే యుత్కృష్టమగును. వాసుదేవుఁడు తలఁపునన జగముల నెల్లను గలిగింపను, నిలుపను, నడఁపను నోపును. కౌరవేశ్వరా! హరి కేవలము క్రీడార్థము పలుపోకలఁ బోవుచుండును. ఎక్కడ సత్యము నడచునో, యెక్కడ ధర్మము వరలునో, యెక్కడ నీతి గలుగునో కృష్ణుఁ డక్కడ నిలుచును. అతఁడున్న పక్షమునన జయమగును.

"పురుషోత్తముఁ డెల్ల భువనములను దాన యఖిలభూతాత్మకుఁడై విహారలీలలను విచేష్టించును. ఈలోకముల మాయచే నొక్కొకతఱి పుట్టి, పెరిగి కర్మానుచరణములు గైకొని వర్తించును. శిష్టరక్షణమును దుష్టనిగ్రహమును దన పను లగుటచే బాండ

వుల సేవ మిడుకొని, ధర్మబాహ్యులైన నీ తనూజుల నమ్మ పోత్సుడు నిగ్రహింప దలచినాడు. అతని నిట్టి వాడని యెఱిగి యెవ్వరాశ్రయింతురో యట్టివారే బ్రతుకుదురు."

అనిన ధృతరాష్ట్రుడు "విష్ణుని నీవెఱిగిన తెఱగుల జెప్పుము" అనుటయు సూతసుతుండ ట్లనియె:

"విద్యయు నవిద్యయు నన రెండు గలవు. అవిద్యాదూషితుడై తమోగ్రస్తుడై నవాడు విష్ణు నెఱుగడు. విద్యాసంపన్నుడెఱుగును" అనిన "విద్యయనునది యెట్టిది? ఎట్లా నీవా సర్వేశ్వరు నెఱింగితివి? ఆ విద్య యెట్టిది? చెప్పుము" అనుటయు, నాంబికేయునకు సంజయుం డిట్లనియె: "సాత్త్విక రాజస తామస వికారముల త్రిప్పలనుబడక ధర్మమాచరించుచు భావశుద్ధి గలిగి యుండుదును. దీన నే నచ్యుతు నెఱుగుదును. విద్య యిట్టిది. నీకీగాక యెవ్వరికైనను నతని నెఱుగుటకు నిది య తెరువు. ఇట్టిది కాని విధమవిద్య" యని చెప్పిన, నతడు నిజనందను కిట్లనియె:

"సంజయుడు మన కాప్తుడు. ఈతని యుపదేశము విని ధర్మమున ముకుందు నాశ్రయింపుము. అతని శరణుజొచ్చిన నీవును సుతులును దమ్ములును బ్రతుకుదురు."

అనిన సుయోధనుడు దన తండ్రి కిట్లనెను: "ముకుందుండర్జునుని నెచ్చెలి యని చెపులార వినియు నతని నెట్లాశ్రయింతును?"

అనిన గాంధారికి ధృతరాష్ట్రుఁ డిట్లనియె :

" నీతనూజుఁడు దుర్మానమున నీతిబాహ్యుఁడై నామాట వినఁడు—వీఁడు నశించుట తథ్యము—"

అన సుయోధనునితో గాంధారి యిట్లనెను :

గాంధారి హితము

"పుత్రకా ! జీవమును, సంపదను, భోగములను, మమ్మును, సుహృజ్జనులను విడిచిపోనెంచుచున్నావు- నీయట్టి యవినీతులును గలరె? విధి వృకోదరుఁడై చంపఁబూనగా నెవ్వరాపఁగలరు ?"

వ్యాస వచనములు

అప్పుడు కృష్ణద్వైపాయనుఁడు 'ధృతరాష్ట్రున కిట్లనెను : "శ్రీకృష్ణునకు నీయంగఁ బ్రీతిగలదా. నీవునుఁ బరమాప్తుఁడైన సంజయుని నతని పాలికిఁ బుచ్చితివి. అది లెస్సకార్యం బన్యాను. వీఁగును సమ్మహానుభావు మహనీయప్రభావంబున్న రూపెఱుఁగును. వీనిబుద్ధి విని యద్దేవునాశ్రయింపుము. అతఁడేకాగ్రచిత్తులై యారాధించినవారికిఁ జేరువయగు. కామక్రోధోపహతులై తమతమ ధనములఁ దృప్తులుగాక, యన్యాయమున వర్తించువారలకు దూరస్థై యుండును. ఎల్లభంగుల నాతని శరణుజొచ్చి బ్రతుకుము." అనిన "ప్రసాదము. అట్ల చేయుదును" అని విచిత్రవీర్యనందనుఁడు సూతనందనునితో, "ఆవ్యాసుదేవ నామనిర్వచనము నాకుఁ దేటపడఁ దెలిపి యతనిఁ బొందు నుపాయముపదేశింపవే" అని యడిగిన "సమస్తమునందును దా నవసించుటయు, సమస్తము

దనయందు వసించుటయు, వాసుదేవుడను పేరున కర్థమందురు. అతనిఁ బొందు నుపాయ మంతరంగనిగ్రహమని యార్యులందురు. చిత్తవికారము లుడిపి యేకబుద్ధిని గొలిచిన నతఁడు ప్రసన్నుఁడగు. పొందును. నీవునుఁ బలుబుద్ధులుడిగి గోవిందు నాశ్రయింపుము" అనిన ప్రజ్ఞాచక్షుఁ డిట్లనియె :

"నాకు నయనములు లేకుండుట కంత వగపులేదు. అఖిల మనోజ్ఞాకారుఁడైన హరి నాలోకింపఁ జాలకపోవుటచే వగపుకలుగును.

"ఆమహాత్మునిఁ గన్నులార నహర్నిశముఁ జూచువా రెంత పుణ్య మాచరించిరో కదా ! ఆశ్రిత వత్సలుఁడును, వినిర్ధూతకలంకుఁడును, ధర్మనిరతుఁడును, కరుణాకరుఁడును, సర్వలోక విఖ్యాతుఁడును, పవిత్ర మూర్తియు, శరణాగతరక్షకుఁడును నగు నుపేంద్రు నాశ్రయించెదను."

అని పలికి పరమశాంతుఁడై పారాశర్యు నుద్దేశించి : "దేవా ! నేను వాసుదేవుని శరణుజొచ్చి బ్రతుకువాఁడను." అనుచుఁ గృతాంజలి యగుటయు, వ్యాసమహామునియు నాశీర్వాదముచేసి యంతర్హితుఁడయ్యెను కౌరవేశ్వరుఁడును దుర్యోధన సంజయుల నిజనివాసములకుఁ బోవఁబంచి తానును గాంధారియు నభ్యంతర మందిరమునకుఁ జనిరి.

# రాయబారము

## తృతీయాశ్వాసము

౧

సంజయుఁడు దన్ను వీడ్కొని చనినపిదప, మఱునాఁడు ధర్మసుతుఁడు దమ్ములను సుతులను నిష్టభృత్యవరులను దొరలను బిలువఁబంచి యెల్లరు వినఁగా నిట్లనెను: "మనము జనార్దనుపాలికిఁ జని యతనిని గౌరవసభకుఁ జనుమని ప్రార్థించిన మేలు. దానివలన బంధుహిత గురుజనములతో రణముగాక సంప్రీతియగును." దాని కందరును "వల్లె" యనిరి. అంత వారందరును తోడురాఁగా ధర్మజుఁడు మాధవు మందిరమున కరిగెను. కృష్ణుఁడు వారల నందఱ సత్కరించెను. ధర్మజుఁడును సమస్తజనములు దన్నుఁ బరివేష్టింప, నొక్కపార్శ్వమునఁ బాంచాలియు సముచితపరివార పరివృతయైయుండ, శ్రీకృష్ణునితో సుఖాసీనుఁడై యుండి యతనితో నిట్లనెను:

"మహాత్మా! మమ్మాపదలనుండి రక్షించుటకును, శుభముల నొడఁగూర్చుటకును పాండుసుత్మ్మపాలుఁ డీ పుట్టువునకు నిన్నుఁ జూపి పరమపదించెను. మిత్రకార్యముఁ జక్కఁజేయ నిప్పుడు సమయము వచ్చినది. నీ కతమున మేము నీతిదూరుఁడైన సుయోధనునితోఁ బోరాటఁదక్క మా యంశమగు భూమి ననుభవింతుము. నీకు మేము ప్రద్యుమ్నాది కుమారులతోడివారము. మమ్ము దురితములు దొరయకుండ నరసి రక్షింపుము."

అనవుడు వాసుదేవుఁడు "నీవంచినయట్ల చేయఁగలవాఁడను. నీతలవెయ్యదిరో సెప్పుము" అనెను.

దాని కజాతశత్రుఁడు "నీవు కరినగరమున కరిగి కౌరవులతోఁడ దగిన మాటలాడి మాతగవుఁ దీర్పవలెను" అని ప్రార్థింప శ్రీకృష్ణుఁ డందుల కియ్యకొనెను.

అజాతశత్రుఁ డంత శ్రీకృష్ణనుద్దేశించి: "అనఘా! మాతండ్రి తలఁపును, నాతని సందును చందమును, నిన్న సంజయుఁడు పలికిన పలుకులును నీకుఁ దెలిసెనుగదా. మా పాలు మాకు పంచి యీయ కయే కృత్రిమపు మాటలతోఁడ మమ్మలుక దీర్చెదరు. మేమధిక దుష్కరములైన పదిమూడేండ్లు గడిపి వచ్చినను కురుపతి కులము పాడి నడపఁడు. చెడఁదలచి కొడుకు వక్రత మాన్పలేకున్నాఁడు. మాకింత కంటె యెడరు కలదె? జననియును సమస్త బంధు జనములును ప్రియమందునట్లు వారిని శాంతులనుగాఁ జేసి, సుఖముగ నొక్కటియై మను నుపాయమెద్ది? ఇచ్చటి బంధులును నీవును నచ్చెరువడి వినుచుండ, నైదూళ్లైనను మాకిచ్చినఁ జాలునంటిని కదా! ఆదుర్యోధనుఁ డంతమాత్రమును కూడఁ జేయలేకపోయెను. ఈ క్రూరత కోర్చు టెట్లు? నే నీ రాజ్యమును గోరుచున్నది స్వలా భము నపేక్షించి కాదు. దాని వలన నాపై నాధారపడియున్న చుట్టాలకు గ్రాసవాసములు నిర్విచారముగ లభింపవలెననియే కదా కౌరవులును మేమును రాజ్యమును పంచుకొనుట యెంతయు సంతోషావహము,

"అయ్యో! లాతులనైననను బగఱనైనను జంపుటకేల యుద్య మించవలెను? మఱియొక విధము లేదా? కౌరవుల పక్షమున మా బంధు సుహృజ్జనములున్నారే! బంధుభావమును గణించక సంపదకై వారిని వధించి నిందపాలగుటయు పాపము నొడిగట్టుకొనుటయు నేల?

"క్షత్రధర్మ మెంత కష్టమోసది? వెఱధర్మ మాచరింపఁ దగ దందురు. అంతయచే క్షత్రియులకు శస్త్రజీవికయే తగియున్నది. అయి నను వంశనాశమున కే నొప్పను;

"యుద్ధమువలన ధనలాభమగును, కాని ప్రాణహానికూడనగును. ఇదిమాత్రము నిశ్చయము.

'జయింతుము; ఓడెదము' అను నిశ్చయమొకటి లేదు. ఇంక సమరమునఁ బరాజయమే కలిగెనా! మరణముకంటె నది హృదయ పుట భేదనము సేయును. అంచుచే నెవ్వఁడు వెనకువగాని యుపాయ మున శత్రువులఁ గడతేర్చునో వాఁడుఁ గుండెపై జేయివెట్టుకొని నిద్రించును. అట్లుగాక పగయే కలిగెనా పామున్న యింటిలో నున్నట్లు చిత్తమొకమాటునుండదు. కావున నధికదీర్ఘ వైర వృత్తి తగదు.

"పగయడగించుట మిక్కిలి శుభావహము. పగచే బగయడఁ గునా? పగగొన్నవ్వఁడు నూర్కొనక యుఁ బలుకయు నుండ లేడు. మూలమట్టముగ బగ దీర్చవలనవచ్చినచో నది క్రౌర్యమగును. ఎట్లూ

హించినను పగబూనుటవలన లాభము లేదు- కావున శాంతిబొందుట యె కర్జము.

"జనార్దనా! యుద్ధము లేకుండ మాకు సంపద కలుగుటయే నా యభిలాష. ధననష్టమును కులక్షయమును నే నిచ్చగింపను.

"శ్రీకృష్ణా! మా మొదట బక్షపాతము లేక మాటలాడుము. ధర్మనీతి వర్తనముల రెండు దిక్కులకు హితమును పెంపును గలుగు నట్లు, వినురాది సజ్జనులకు నచ్చునట్లు, మెలపును పరుసందనమును నేడి యుచితమో యట్లు భూపతులెల్ల రెఱుగ చెప్పుము.

"భగవంతుడు దుర్యోధనుని కిడిన బెడిదములు పల్కిన-నచో సహించి యుండుము. ఎందుకనగా, గురుపతి పెద్దలమాట నాలింప దనుట ప్రసిద్ధమే గదా! మనము గౌరవముతో గురువృద్ధుని పల్కును తలయొగ్గి సాగనిచ్చిన-చో జనులు మనలను మెత్తురు.

"ఒకసారి ధృతరాష్ట్రుడు సుతుపక్షమువాడై మా విన్నపము నాలింపక, యేమిచేయవలెనో చెప్పక, యవినీతి జేసినను, నింక సంధించుట కవకాశము లేదని తొందరపడి మరలిరాకుము. ఒకసారి తెంపి శరణ్యమైన-చో లోకమెల్ల మెచ్చునట్లు మనము ధర్మపక్షమున నే యుండవగును. అప్పుడే మాకు నిశ్చింత చేకూరును. శ్రీకృష్ణా! ఇంతకు నీకు నేను చెప్పవలయునా? నీవేది చేసినను నాకు ప్రియమే.

అని చెప్పి కొంత తడవాగి ధర్మజుఁడు తిరిగి యిట్లనియె : "జనార్దనా ! నీవు సుయోధను పాలికిఁ బోవలదనియు నొక్క బుద్ధి వొడమెను. గోవిందా! అతఁడును, వాని మంత్రులును పొగరుబోతులు. కార్యవచనములను చెక్కవినరు. వారు క్రూరకర్ములు, అవినీతులు, కుటిల మతులు. అట్టి నీచుల కడకు నిన్నుఁ బంపఁజాల. నీవు సంకట పడియెడు దేవపదవియైన నే నొల్లను. అందుచే కృష్ణా! నీ వం దొంటిగ నరుగ వలదు."

అని ధర్మజుఁడు పలుకఁగా శ్రీకృష్ణుఁడు మోమున నలుక గదుర నిట్లనియె :

"సుయోధనుఁడే కాఁడు, ధృతరాష్ట్రుఁడు కూడ నట్టివాఁడే. నీవన్నమాట నిజము. నీతలఁపు నాకగపడినది. కాని యిట్టి శంకను విడుపుము. నేను నిక్కముగా నలిగినచో యుద్ధమున నన్ను మార్కొనువాఁడెక్కడ నొక్కఁడేని కలఁడా ?

నన్ను కౌరవసభకుఁ బోనిమ్ము. నేఁ జనుట యొక్కటియును మేలే. దానివలన సంధిసిద్ధియైన నగును, లేదా, బంధుజనులతోడి యుద్ధమువలనఁ గలుగు పాపమునుండి విముక్తులమైనను నగుదుము."

అనిన కృష్ణునకు యుధిష్ఠిరుఁ డిట్లనియె ; "శ్రీకృష్ణా ! నీకు శుభమగుఁగాక ! నీ యిష్టమువచ్చినట్లే చేయుము. మాకును కౌరవులకును సంధి నొడగూర్పుము. అన్నివిధములను నదియే లెస్స. ఈ కార్యమును జక్కఁబెట్టుటకు నీకన్న సమర్థుఁ డెవఁడు ? నీవు మమ్మొ

ఱుఁగుదువు; కౌరవుల నెఱుఁగుదువు; అర్థసిద్ధి నెఱి యెఱుఁగుదువు; మాటలనేర్పు నెఱుఁగుదువు. నీకు సేమము చెప్పెడిపాటివారముగాము.”

అనిన ధర్మజునకు ముకుందుఁ డిట్లనియె: “ధర్మజా! సంజయుని మాటలును, నీవన్న పలుకులును వింటిని. నీమది ధర్మైక నిష్ఠమై నున్నది. కౌరవులు వైరమును విడువరు. ద్రోణ భీష్ములు తమ పక్షము నున్నారని వారు బిరుసులై యున్నారు. ఇంతకును రాజన్యులకు యాచించి తినుట తగునా? క్లేశప్రాప్తిని రాజ్యమును జవిగొన్న వారు సరి భాగమేల యిత్తురు? ధార్తరాష్ట్రు లధర్మము సేయ జంకరు. అందుచే యుధిష్ఠిరా! దైన్యమును విడువుము. యుద్ధ సన్నద్ధుడవుగమ్ము. అరివర్గ జయమువలన నిహపరసుఖములును, చిర కీర్తియును గలుగును.

కృష్ణుఁడు ధర్మరాజుతో కౌరవుల దుర్జయము చెప్పుట

గురు భీష్మాదులు చూచుచుండ నిండుసభను ముష్కరులై మీకు వారెగ్గుచేసి పశ్చాత్తాపమును సైతము పొందరు. అట్టి దురాత్ముల యెడ గృపయును బంధుత్వమును పాటించుట తగదు. ఈ దుర్మార్గుల గర్వక్రౌర్యములను జూచిన నెవ్వరికి కోపము రాదు?

కపటపు నెత్తమును నెపముగా మిమ్ము వెడల నడచు నప్పుడు దుర్యోధన దుశ్శాసన శకుని సూతనందనులు సంకోచింపక కలకల నవ్వుచుఁ బలికిన పలుకు లుగ్గడింప వచ్చునే? వానిని విని సమస్త జనములు ధృతరాష్ట్రు నిందించుచు మీరు బలవంతులరయి

యుండియు సత్యము పాటించి యేమియు ననక పోవుటను జూచి యచ్చెరు వాటుతో నుమ్మలించుచుండిరి. తిట్టువాట్లంబోయెడువారు దైవోపహతులై యున్న చెడియుందురు. కావున, వారలను చెఱచుటయుఁ జాలగన. క్రూరాత్ములగు కౌరవులెల్ల వారికిని వధ్యులే యగుదురు; నీ కేల యవధ్యులైరి? పాపాత్ములగు హింసకులను పాములనువలె నిర్విచారముగ వధించుట కర్తవ్యము.

ధృతరాష్ట్రునకును, భీష్మునకును నీతో మొదట మొదవ భక్తి చేయుట తగును. నేనచ్చటకుఁబోయి వారియెడ నీకుగల వినయము నభివర్ణింతును కురుసభలో మిత్రులు, బంధువులు, రాజన్యులు వినునట్లు నీ పుణ్యచరిత్రమును, నీధర్మనిష్ఠయుఁ దెలియఁ బలికెదను. దానికి దుర్యోధనుఁ డీర్ష్యకొని కొఱగానిమాటలాడుటయు, తండ్రి యతని వారింపనేరమికిఁ దోఁచుపేక్షించుటయును జూచి, మీ కొల్లిటి పాట్లు దలఁచి, గొల్లనారును వారినే గర్హింతురు. ఇంతియ కాక, మన కొండేమి వలయు? నా యోపినంతయుఁ బెక్కుభంగుల సంధియ కావింపఁ జూచెద. అవ్విధము సిద్ధించిన మేలుగాదె? సంధి కుదురనిచో, నచ్చటి యుత్సాహము చందమును, నక్కడివారి వర్తనములును, వారి కొలఁదులును నెఱిఁగి, నీకు విజయమగువిధమునఁ జనుదెంచెదను.

ఆదుర్యోధను డేనఁ బ్రాణముండునంతదనుక పుడమికి కీడు తప్పదు. అందుచే యుద్ధము సిద్ధము. నేను కయ్యపుకతనము లెన్ని

యేని గంటిని. నీవనుత్సాహివికావున చతురంగబలము నాయిత్తము గావించుచు, దొరలను బురిగొల్పికొనుచు, నాలస్యములేక సమరమునకు సన్నాహము సేయుచుండవలెను."

అని పలికిన విని, వృకోదరుఁడు దామోదరున కిట్లనియె :

"మాధవా! సమరము గలుగునని మమ్ము నెఱపింపకుము. ఆ కుమతియగు ధార్తరాష్ట్రుఁడు తమించునట్లు రాజ్యభారమును సౌఖ్యముతో నడపుము. అతులువ పాపాత్ముఁడు, మదాంధుఁడు. నీవంపు నెత్తిన జేయఁడు; వాని కెవ్వరును నడ్డము సెప్పరు.

"మాకును వారికిని బితామహుఁడగు భీష్ముఁడు వినుచుండఁ గురుకులేశ్వరు నాస్థానమున సుయోధనుతో నావచనములుగా నిట్లు చెప్పుము : అన్నదమ్ముల మైయుండి మనల నొరులు దలయెత్తి చూడ నొండొరులతోడఁ బెనఁగనేటికి? పెద్దవారిమాటవిని యీరాజ్యమును పంచుకొని యనుభవించుట తగదా?

"శ్రీకృష్ణా! ఈవిధముగా నాపలుకులుగాఁ జెప్పి నీకెట్లుచిత మని తోఁచునో యట్లు సంధిచేయుము. మేమును కౌరవులును గలిసి యుండుట, భూజనులకెల్లను హితమును సౌఖ్యమును గలిగించును."

అనిన భీముని జూచి చిఱునవ్వు నవ్వి యంబుజనాభుఁ డిట్ల నియె : "ఎన్నడు విన నివి భీముని కడ కడు వింతలగు మాటలను వింటిని. ఇతఁ డిప్పుడు మార్దవము నొందుట యగ్గి చల్లనగుట, భూరి భూధరము లాఘవ మొందుటగాదె?" అని సాహిళాదభులు యుద్ధ

కున నాయాసపడుట కోర్వకయు, గౌరవులను చంపనొల్లకయు, నార్ద్రుఁడైన పవనసూనుని బురిగొల్పఁ దలఁచి శ్రీకృష్ణుఁ డతనితో నిట్లనియె :

"కీచకాంతకా ! యుద్ధము నందలి వేడుకయు, మహోగ్ర విరోధుల ననుప జాలిన దర్పోద్ధతియు, సుయోధనుని యున్నతి సైపని ఏపును, నిజాగ్ర జన్మునకు రాజ్య సంసిద్ధిఁ జేయు తలఁపును గలుగు నీ విట్టి యసంబద్ధములైన వాక్యములు పలుకుటొప్పునే ?" అని దానితో నాగక "వెఱపెట్టిగిదో యెన్నఁడు నెఱుఁగని నీ యట్టి వానికి నెవ్వరొకో యీపిఱికితనము నింత యలవడ గఱపినారు." అనుచు గృష్ణుఁడు భీముని జూచి గలగల నవ్వెను.

దానికి దరహసిత వదనుఁ డగుచు భీమసేనుఁడు వసుదేవ సూనున కిట్లనియె :

"కృష్ణా ! గంటుతనపు మాటలకుఁ గోపకు. 'పాండు నృపాలు పాలు లభించినఁ జాలును.' అన్న ధర్మజుమాటలకు నేనడ్డమాడ నను విషయము నీ వెఱుఁగవా ? నాపస యుద్ధములోఁ జూపెదను. కృష్ణా ! నాకొలఁది విచారింపక నీవిట్లనఁ దగునే? భూమ్యాకాశములు దల క్రిందులైనను నేను వెనుజూపువాఁడనే ?"

అనిన భీమునకుఁ గృష్ణుఁ డిట్లనెను : భీమా ! సవ్వటాల కని నంతనే యిట్లగుదువా ? దుర్యోధనాదుల కిల్బిషములను దలఁపక యిట్లు పిఱికివగుటఁ జూచి యిది చందము కాదని యంటినిగాని నీ చేవయు నీవు మును చేసిన భంగులు నే నెఱుఁగనే." అని చెప్పి

మాధవుఁడు మఱియు "పార్థుఁడు గుఱ్ఱములఁ దన రథమును నడపు టకు నన్ను గోరి యెంతయో ప్రార్థించెను. దానికి నేననుమతించితిని. కాని యుద్ధార్థులమైన మాకు నిన్నాశింపఁదగదా? యశము విజయము నొంటరిగా సంపాదింపఁగలమా?"

ఇట్లనిన భీముఁడు "ఏమీ? యూపాస్థఁసను నీవును దండిసుగ లై రాజోప్త కౌరవ్య సంగ్రామములో భయమునఁ బెద్దమిట్టకి- బాహు దర్పములు తీర్చుచుండఁగా మే మందఱమును మిమ్ము వెంగంది చూచెదముగాక. ఈ సారెకు బోయిరమ్ము. భీముఁడి ట్లితరి రిత్త మాటలకుఁ గోపింపఁడు" అని యిట్లు బావమఱఁది మేలమాడి యంతట దనివోవక బకమర్దనుఁ డతనితో నిట్లనియె. "శ్రీకృష్ణా! సంధి కుదరక యుద్ధమే ఘటిల్లినచో గంధగజ ప్రకరము కుంభములు ప్రయ్యు నట్లును తురగపంక్తులు భూమి ప్రెళ్ళునట్లును, రథములు తుత్తునియ లగునట్లును, నీ వాశ్చర్యపడునట్లు రణరంగమున వీరవిహారము చేయుదును."

అని భీముఁడన దేవకీతనయుఁ డతనితో నిట్లనియె: "పావనీ! చెప్పినంతకంటె యెక్కువ సేయు కడిందిమగఁడవు. నిన్ను చెప్పగా గాని పలుమాఱు లాపదలకు భయమందక మేమెల్లరము దాఋ వార్తల నీదినవారము. ఇదే, కౌరవసభ కేఁగి సంధికుదర్ప యత్నిం తును."

అనిన వాసుదేవున కర్జునుఁ డిట్లనియె: "శ్రీకృష్ణా! చెప్పవల సిన దంతయు నజాతశత్రుఁడే నీకు జెప్పెను. అదంతయు నీవు వింటివి.

అర్జునుఁడు శ్రీకృష్ణునితో తన అభిప్రాయమును జెప్పుట

మీకుఁ జెప్పవలసినది వేరేమి కలదు? అయి నను నాకుఁ దోఁచినది చెప్పెదను. 'ధృత రాష్ట్రుఁ డతి లోభదూషితుఁడు. మా భాత్రీ భాగము సతిఁడిచ్చునా? సుయోధనుఁడు కూడ దురాత్ముఁడు. సంధి యేల యగును? కమలోదరా! నీవొనరింపఁ బూనిన పనివలనఁ గీడు పుట్టునా? కావున సత్కుండిన కార్యము లగుటయుఁ గలదు. ప్రయ త్నము చేయుట మనపని; ఫలసిద్ధికి దైవము తోడ్పడవలయును. నిజముగా లీలామానుష విగ్రహుండవగు నీ కసాధ్యమెద్ది? వైరముతో ధర్మజుని పరిభవించిన క్రూరులు వధ్యులన్న నాశ్చర్య మేమున్నది? సుజనవత్సలా! గ్రుపదాత్మజను నిండుసభలో పరాభవించినను సైచి యూడిన వారలకు మేమరిగిన విషయములు నీ వెఱుఁగవా! అంబుజాక్షా! అలవి యెఱుఁగక ధార్తరాష్ట్రులు మమ్ము బఱచినపాట్లు మా మాన సముల చనిటినేల నాటి విస్తలపలె సంకటింపక చెడిపోయెను. అందుచే నక్కుటిలకుల సెమ్మనగ్రు నై నను నోడఁబఱచి మాకును వారికిని భూమి సగముగాఁ జేసి, పొందిపొసఁగి యుండెడునట్టి తెఱఁగు సేయుట కలమేలు. దానివలన గౌరవమును సుఖమును గలుగును. ఈ విధము నీకు నచ్చునేని 'ఇట్లు వలదు; మీ రీకార్యము నిట్లు సేయుఁడ'ని మా కానతీయుము."

అనిన విని శ్రీకృష్ణుఁడు విజయున కిట్లనియె. "ఫల్గునా! సమయమునకు వర్షములు కురియనిచో వేయివిధముల కృషి సల్పినను ఫలము గల్గునే? మన పౌరుషములు ఫలించుటెల్ల ప్రసన్నమగు

దైవముచేతనే గదా ? కావున సంధించుటకై నా రూపినంతవఱకు పురుషకార మొనర్చెదను. దైవకృప యెట్లున్నదో చెప్పలేము. సుయోధనుఁడు మీ భూభాగమును మీకిచ్చు న్యాయమునే తలఁచిన వాఁడైనచో బాల్యమాదిగ మీయెడల నెవిధినైన చెఱుచుట నింతటి పాపము లాచరించునా ?

"ఇదంతయు నట్లుండనిమ్ము. నీకు జ్ఞాపకముండియుండవచ్చును. విరాటుని పశువులను విడిపింప నీవు పోయినప్పుడు భీష్ముఁడు దుర్యోధనునితో 'వచ్చినవాఁడు ఫల్గునుఁడు. మనవానిలో నెవఁడును గెలుచుట లేదు. రాజ్యలక్ష్మికై పెనఁగిన బలములు రెంటను గెల్చునా ? జయమును గలుగవచ్చును; పరాజయమును కలుగవచ్చును. కావునచే యుద్ధము శ్రేయస్కరముగాదు.' అనియె. దాని కతఁడు విధముగా నుత్తరమిచ్చె 'మనకును పాండవులకును పొందెట్లు కలుగును ? నేను రాజ్యభాగ మీయను, ఇంక యుద్ధము తప్పదు.'

"ఆ మాటల ఫలము నప్పుడే పొంగియు నాకష్టాత్ముఁ డింకను వివేకమును పొందఁడు.

"అతని గుణదోషము లెట్లున్నను నాకు ధర్మజునిబుద్ధిని నడుప వలయును. అతఁడు నియోగించినట్లు సంధి చేయుట కేఁగి వారి బలమును చూచి వత్తును."

అనిన ముకుందునితో నకులుఁ డిట్లనియె: కృష్ణా ! ఒకరు ఘనరథమును నడచిన, మఱియొకరు పెయ్య నడుపవలెనే? ఆ కౌరవ్యులు

చెడు తెరువున నిలిచిన నిలుతురు గాక. మనకు కార్యమేల? కృష్ణా! నీ యనుగ్రహమును, ఏడక్షౌహిణుల బలమును, భీమార్జునుల బాహుబలమును కలిగిన మమ్ముఁ జూచి వారు గొందల మొందరా? అంతియగాక నీవు రాయబారిగా వెళ్లుటయు గార్యము సాఫల్యము కాకపోవుటయునా?" అనిన నకులుని మాటలు విని సహదేవుఁడు వాసుదేవుని కిట్లనియె: "కృష్ణా! ధర్మరాజును భీమార్జున నకులులును సహింపరాని మాటలాడెదరు. నీవు కూడ కాదనక వారన్న ప్రతి మాటకును సుంకొట్టుట, మఱియు బాగున్నది. అయ్యో! ఐదూళ్ళిమ్మని యాచింప బోవుటయా? సుయోధనుఁ డెక్కడ? భూమిలో నగమిచ్చు టెక్కడ? ఇంత లేని మహాపేదలట్లు దైన్యమును పొందుట యనుచితము గదా? ఈ దైన్యమునకు చుట్టాలును మంత్రులును దిట్టరా? ఇతర రాజులకు ఇట్టి విధానము నచ్చునా? ధర్మజుఁడు వేడగా, కృష్ణుఁడేఁగఁగ బోగా, ఆ ధార్తరాష్ట్రులు పాలియ్యక చలమున బెనఁగుటయు గల్గుటయా? అయ్యో! కూడింత తీవయ్యోనే?

"అచ్యుతా! ఒకసారి ధర్మమార్గమునకు వారియ్యకొనిన నట్టి సంధి పెంపార నేర్చునే? వంకమాట లేల? ఇప్పు డుచితమైనది కయ్యము. కౌరవసభయందు నిదే మానిశ్చయముగా చెప్పుము."

అని సహదేవుఁడు పలుక సాత్యకి సంప్రీతుఁడై "ఇతఁడు చెప్పినది నిజము. దుశ్చరిత్రుఁడైన యా సుయోధనుని బోధింపఁ బోవుట వలనఁ బ్రయోజనమా లేదు. పైపెచ్చు గౌరవమును జెడును. ఇక్కడి వీరని కాయమున కెల్ల సంగ్రామమే ప్రియము."

అనిన విని రథికవరులందఱు 'సహదేవుఁడును సాత్యకియుఁ జెప్పిన మాట వాస్తవము. కయ్యమే కర్తవ్యము. భంగము సేఁగికొన దగదా?' అనునివి మొదలుగా ననేకు లనేక ప్రకారములఁ బీరాలాపములఁ గొలువెల్ల నొక్కమ్రోఁతగాఁ జెలఁగిన రొలుఁగులు నింగి ముట్టె.

తరువాత ధర్మనందను పలుకులు తనకు హృదయతాప మొనరింప, మోమున దైన్య మొందఁ బాంచాలి గద్గదకంఠి యగుచు మెల్లగా శౌరితో నిట్లనియె:

ద్రౌపది కృష్ణునితోఁ దన మున్ను పడిన భంగపాట్లుచెప్పుట.

"శ్రీకృష్ణా! వరమున బుట్టి భరతవంశముఁ జొచ్చి, పాండు భూవరునకు కోడలనై, జనవంద్యులను బొంది, నీతివిక్రమస్థిరులగు పుత్త్రులను బడసి, సహాజన్ముల ప్రాపుగాంచి యున్నట్టిఁ బ్రశస్తికి నెక్కినదానను. నీవు నన్ను సుభద్రకంటె గౌరవముతో సంభావనసేతువు. అట్టి నన్ను, ఒక తులువ, రాజసూయావభృథమునఁగు శుచిస్త్రై పెంపొందిన వేణివట్టి యీ యేవురుఁ జూడఁగా సభకీడ్చెను. కులాంగన నిట్లొనర్తురా? ఆసభకు నేకవస్త్రనగు నన్నుఁ గొనివచ్చి నొంచు దుశ్శాసనుఁ జూచుచు పతులసంభ్రములై నా యాసలు మాని చిత్రములగతి నున్నప్పుడు, ముకుందా! నా చిత్తము విశ్వాసముతో నిన్నుఁ గొలువవచ్చెను.

మాధవా! ఏ ప్రభువు కోడలనక యిప్పుడు నన్ను దాసిగఁ జేసెనో యమ్మహాపురుషుని పాలికి పతులు పోవగా వీరలతో నేను

కూడ పోయి కోడరికము సేయుదునో, యాడిగము సేయుదునో
నీవే చెప్పుము."

ఇట్లుగ్గడించి ద్రౌపది బంధురమైన క్రొమ్ముడి గ్రమ్మరవిడ్చి,
మనమునఁ బొంగు విషాదరోషముల నాచికొనలేక, బాష్పములు
గ్రమ్మఁగ, గిగ్గన లేచి యార్తయై నల్లని త్రాఁచోయననొప్పు వెంట్రుక
లను వలచేతఁబూని గోవిందుని ముందటఁబెట్టి యిట్లనియె: "అచ్యుత!
ఇవి దుస్ససేను వ్రేళ్లుదవిలి సగము తెగిపోయి మిగిలినవి. కౌరవుల
కడ సంధిమాటలు చెప్పనునయమున వీనిని తలఁపవలయును.

"ఈ వెంట్రుకలుపట్టి యీడ్చిన దుస్ససేనుతనువు పోరిలో నింత
లింతలు తునియలై చెదరి దూపటిల్లియుండఁ గని యుండు కాలమునఁగాని
యల్పకార్యములచే పౌనుపఁబట్టి చిచ్చారునది? ఇట్టి బన్నములు
పడిన ధర్మనందనుఁ డను సేనను రాజరాజు పీనుఁగును కన్నారఁ
జూడజాలమైతిమేని భీమసేను బాహుబలమును, అర్జును విక్రమమును
గాల్పనే?

"చిచ్చు నాఁడిట్టిదిట్లుగ నింతకాలము రక్కసతాల్మితో కోప
మును మనస్సున నిల్పితిని. దుష్టనిగ్రహముపూని జగములఁ గాచునట్టి
తోఁబుట్టావు నీవును, తేజమునఁ బొల్చిన భర్తలును గల్గ, శ్రీకృష్ణా!
దీనికి నాకు పెన్నుడుఁ బుట్టదు?"

అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిని కృపాయత్త
చిత్తుఁడయి నారాయణుఁ డూరార్చి కూర్చుండ నియమించి, కన్నీరు

దుడవను, పెన్నెఱివేణి ముడువను తగువారి నియోగించి, యమ్మానినితో నిట్లనియె:

"ముగ్ధియా! నే నుండఁగా నీ వేల దుఃఖింతువు? నాఁడు వృకోదరుఁడును విశ్వచ్చుఁడును కోపగాఁగ ధర్మసుతు సనుమతితో నీవు మెచ్చునట్లు శత్రుసంక్షయముఁ జేసెదను. సంధి కాదు. దురాత్ము లగు కౌరవు లుర్వి యిత్తురా?

"లలనా! ఊరడిలుము. నీ యేడ్పుల కొలఁదియె కురునృపాల పుత్త్ర కళత్రముల యేడ్పులు. ఇంకె ఆ యేడ్పులను నీవు కిలకల నవ్వుచు వినెడు కాలమైనది.

"యమమహిష ఘంటికానాదము వినఁ గౌతూహలము గల కౌరవులకు సంధికార్య శాంతవచనము లిష్టములగునే? పాంచాలీ! వినుము. రిపుక్షయముఁ జేసి యుజ్జ్వల పుణ్యలక్ష్మీసమేతులైన పాండు కుమారుల యధికవిభవమును నీవు జూచెదవు. దీని కెంతో కాలము పట్టదు."

అని ఊరడిల పలికిన విని ద్రౌపది కలతఁదేరిన మనోగతి కలదై యేడ్పుడిగెను. అప్పుడు ఫల్గునుఁడు గోవిందునితో నిట్లనియె: "శ్రీకృష్ణా! పాండవులును ధార్తరాష్ట్రులును చుట్టలకతమున నీకొకరూప. కావున నుభయపక్షములకు నుచితమగు హితమునొనర్పుము. ధర్మార్థసంగతముగ ధర్మతనయుఁడు చెప్పినట్లు వినక దుర్మతులగు నా కౌరవు లధర్మప్రవర్తనులగుచో దాని ఫలమేమగునో భగవంతుఁ డెఱుఁగును."

అది విని శ్రీకృష్ణుఁడు "కౌరవులకును మీకును హితమును ప్రియమును చేయఁగోరియే నేను ధృతరాష్ట్రుని కడకుఁ బోవుచున్నాను." అనెను. అజాతశత్రుఁడు శ్రీకృష్ణుని యీ ధర్మవచనములు విని చిత్తమునఁ బొంగి 'అనఘా! అట్లు చేయుము. మన నిశ్చయమిదియ' అని కార్యము నిశ్చయించి, తిథిశుద్ధి నిరూపించి, నారాయణుని జూచి "నీ నక్షత్రము రోహిణిగదా! ఎల్లి రేవతి. నీకుఁ జంద్ర తారాబలములు గలవు. గమనమునకు రేవతీతార మేలు; పయనమగుట లెస్స' యని చెప్పెను, విప్రాదుల కతఁడు సగౌరవముగా నియ్యకొనిరి. పాండవాగ్రజుని గౌరవమును గలదఁ జూచి యెల్ల వారును విన 'అది యట్లగాక' యని పలికి, తరువాత తానును దమ్ములును, పాంచాలియు, పరివారకులును సుచిత్రప్రకారముల నిజనివాసములకుఁ జనిరి. మఱునాఁ డరుణోదయమున కృష్ణుఁడు కాలోచిత కృత్యములు నిర్వర్తించి, సూర్యోపస్థానము సేసి, యగ్నిసమారాధన మాచరించి, ధరణీసురులను ప్రణామపూర్వకముగా ప్రయాణదానప్రముఖ పూజావిశేషములచేఁ బ్రీతులఁ గావించి, వారల యాశీర్వాదములఁ బడసెను. తర్వాత సాత్యకిని రావించి: "మన ప్రజలలో హస్తినాపురికి రావలసిన వారిని సిద్ధము కమ్మని నియోగించి నీవును పయనమై యేతెమ్ము." అని తిరిగి "సాత్యకీ! దుర్యోధనుఁడు దుష్టాత్మకుఁడు. అతని అనుయాయులును కుటిలబుద్ధులు. కావున చక్రగదాద్యాయుధములు రథమునఁ బెట్టింపవలయును." అని చెప్పి పనిచి, సమయజ్ఞతను పొడసూపి నిలుచున్న దారుకునిఁ జూచి తేరు పూన్పు

నియోగించె. అతఁడును మణిగణ ప్రభాపటల జటిలమగు నరద
మును పన్ని శైబ్యసుగ్రీవ మేఘపుష్పవలాహకము లనఁబడు తురగ
ములఁ బూన్చి, గరుడధ్వజమెత్తి, తెచ్చిన పుండరీకాక్షుఁడు శుభ
సూచకముల గైకొనుచు, పుణ్యాంగనలు సేసఁగొలుక రథమధిరోహిం
చెను. అప్పుడు ధర్మనందనుఁడు హరి కిట్లనియె: "నీవు వచ్చితి వనిన
కుంతికి ప్రాణము వచ్చినట్లుండును. మాయందరి మాఱుగా నా
పవిత్రచరిత్రకు మ్రొక్కి కుందిన యామె చిత్తము నొప్పితీర్పుము.
మఱియు గురుఁడు బాహ్లీకాది కురువృద్ధులును సుహృద్బాంధవులును
ప్రీతిఁ బొంద నుచితమగు రీతిని ప్రణామములఁ జెప్పితి ననుము.
అనఘా! విదురుఁడు మధ్యస్థుఁ డగు హితుఁడు. నారు మాఱుగా
నతని నాలింగనము సేయుము."

తర్వాత అర్జునుఁడు: 'ధర్మజుఁ డనినట్లు సగము రాజ్యమును
మా కిచ్చుటకు సమ్మతించిన సరియే. లేకపోయినచో ఆ పక్షమున
నున్న యందరిని సపుత్త్రమిత్త్రముగ గ్రాచ్చి పాతుగాను." అనఁగా
వృకోదరుఁడు మిగుల సంతసించెను. నకుల సహదేవులును దానికి
సంతసమంది "నెయ్యమో కయ్యమో ఏదో యొకవిధమును పరిష్క-
రించి తడయక రమ్ము" అని యచ్యుతునితో ననిరి.

ఇవ్విధమునఁ బాండునందను లందఱును గోవిందునకు వలయు
మాటలు చెప్పి, అతనిఁ గౌఁగలించుకొని, యథోచితప్రకారమున
వీడ్కొని వలగొని మగిడిరి. కమలనాభుఁడు గదలిపోయి సూర్యాస్త
మయసమయమున కుశస్థలమును [illegible]ఁజనునప్పు డందలి విప్రులెల్ల

రెదురువచ్చి, నిజనివాసములకుఁ జనుదెండన ప్రసన్నవదనుఁ డగుచు విశాలరమణీయమైన బహిరంగణమున పటకుటీరప్రకర మెత్తించి విడిసి, తగువారును దారును వారల గృహముల కరిగి, యభ్యాగత పూజలు గైకొని, వారిని సంభావించి విడిదలకుఁ బోయి సముచిత సముచితవృత్తిఁ బ్రవర్తిల్లుచుండె.

౨

అంత నక్కడ కౌరవపక్షీశ్వరుఁడు శ్రీకృష్ణాగమన వార్త విని యాక్షణము గాంగేయ గురు విదురులను, సుయోధన సంజయ కర్ణ సైంధవ శకునులను బిలువబంచి, నందనునితో నిట్లనియె :

"కృష్ణుఁడు పాండవ కార్యార్థముగా మనయొద్దకు వచ్చుచున్నాఁడు. నేఁడు కుశస్థలమున విడిసె. రేపిందు వచ్చునని వింటిమి. ఇట్టి యాశ్చర్యమునుం గలదే ! సర్వలోకాభిగమ్యుఁడగు నమ్మహానుభావుడు మన నభిగమ్యుల మైతిమి. మన కింతకంటెను బెంపెయ్యదీ? అతఁ డెవ్వరివలన సంతుష్టుఁడయ్యె వారికి శుభమును, ఎవ్వరిచేన ననాదరము సేసె వారి కశుభమగుటయుఁ దప్పదు. అతనికి వలయు పూజ లాచరించుటకు సంవిధానము సేయుము. గృహాలంకరణాది మంగళ ప్రకారము లనుష్ఠింప నియమింపుము. అతని చిత్తమునకు నీ విభవమును దనమీఁది ప్రియమును దోఁచునట్టి తెఱఁగున సమస్తమును సమకట్టింపుము."

అనిన ధృతరాష్ట్రుపలుకులకు గురుఁడును భీష్ముఁడును సంతసిల్లి కొనియాడిరి. దుర్యోధనుఁడును 'అట్ల అగుఁగాక' అని పరిచారకుని పిలిపించి ముదమున "అలుకుఁడు. కస్తూరికముల ముగ్గులువెట్టుఁడు. కుంకుమముల గోడలు పూయుఁడు, ప్రతిగృహమున మణిదామములఁ గట్టుఁడు. నగరెల్లను శోభిల్ల నలంకారము సేయుఁడు. "వాసుదేవుఁడు రేపటికి వచ్చును; అంతకు మున్న యింతయు గావింపవలయును" అని పనిచి, పురమున నుత్సవము సాటుఁడని నియోగించెను.

అట్టి యెడ నాంబికేయుఁడు విదురున కిట్లనియె:

"అనఘా! వివిధ మణిమయ రథములును, జవనాశ్వములును, భద్రసామజములును, రత్నవిభూషణములును, దాసీనివహములను కృష్ణునకు నే నిత్తును. మనయింట సుయోధన గృహమున దుశ్శాసను నికేతనమున నెయ్యది యాతని మనసాకర్షించునో యది యెల్ల గౌరవమున నీయవలయు." అనవిని విదురుఁ డిట్లనియె: శ్రీకృష్ణునిఁ బ్రీతునిఁ జేయుకంటెను హితకృత్యమొకటి గలదె? నీ తలఁపు నాకు తెలిసినది. నేర్పుతో శౌరికి లంచమిచ్చి యాతనిని సంప్రీతుని జేసి కార్యగత భేదముసేయఁ జూచెదవు. ఎంతటి వెలవు! సుమేరుసదృశమగు ధనరాసులఁ జూచియు నాతఁడు పార్థుని విడుచునే? క్రీడి భక్తియు, నచ్యుతు పెంపును నీ వెఱుఁగవే? హరి కర్జునుఁడు ప్రాణతుల్యుఁడు. మీ మాటలును సంభావనయు నీతనికి నచ్చుగాదు-మనకడ కతఁ డేకార్యమునకు వచ్చుచున్నాఁడో యాతని వంచింపక చేయుట యతనికి బ్రియము తక్కినవి వేయు నేల?

అనిన విని దుర్యోధనుఁడు తండ్రి కిట్లనియె: "విదురుఁడు చెప్పి నది నిజమే. కృష్ణుఁడు తుదకు పాండవులతో వేఁటగునా ? ఈవి కిది సమయమా ? పాండవు లడిగినది యిచ్చినచో కౌరవులు బెదిరిరని లోకు లనరా? శ్రీకృష్ణునకు పూజనీయుఁడగు, అది నే నెఱుఁగుదును. అయినను ధనము లిచ్చుటవలన ననదతనము వచ్చును. దానికితన వైరులు గర్వింతురు. ఇట్లు పగయడఁగునా ?"

అనఁగా భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లనియె: "మీరిచ్చిననొక విధముగానను, సీయక పోయిన మరొకవిధముగాను తలఁచువాఁడా కృష్ణుఁడు ? పుత్రా ! వినుము. అతఁడు సేయఁబూనిన పని తప్పింప రాదు. పాండవులఁ దేర్పను కృష్ణుఁడు. వెరపుగఁ జొచ్చిన మేలు. అమ్మహాపురుషు పనుపు సేయుము. నారాయణుఁడు చెప్పినట్లు మీ రెల్లరు విని సమ స్తకార్యములును జక్కఁబడును."

అనుటయు సుయోధనుఁడు భీష్మున కిట్లనియె: "పాండవులకు రాజ్యమునందు సగముపాలిమ్మని హరి యడిగినచో నేసీయను. అది యట్లుండనిమ్ము. నేను వేఱొక కార్యమును సేయదలఁచితిని. అది వినుము. పాండవులకు జనార్దనుఁడే యేఁడుగడ. అతనిని బట్టి బంధించిన తెక్కలువిరిగిన పులుఁగులఁబోలె వారు నాకు విధేయులగుదురు. పాంచాల యాదవాదులైన తదీయ బంధుమిత్రులు నావశమున వర్తిల్లుదురు. సమస్తదేశములను నేన యేలుదును. దీనికిఁ దగినయుపాయ సహాయముల ననుపు సేసెద. నీవింక నేమిచెప్పెదవో సెప్పుము."

అనిన విని యతిఘోరమగు నవ్విచారమునకు నమాత్యసహితముగా సంతప్తచిత్తుండై వైచిత్ర్యవీర్యుఁడు కొడుకున కిట్లనియె "ఓహోహో! ఇట్లనుట జగద్ద్రోహము. ఈమాట మఱుస్రము. దూతత్వమును, మాహాత్మ్యమును, ధర్మోత్సాహమును అబాధ్యతకు కారణములు. అయ్యో! అతని రాక కురువంశమునకు కీడాపాదించునో? ఓరీ పాపాత్మా! శ్రీకృష్ణుఁడేమి చేసెనని యిట్టి దుర్బుద్ధి తలపెట్టితివి?" అని యడల్చెను.

అప్పుడు గాంగేయుఁడు ధృతరాష్ట్రునితో నిట్లనియె: "నీకొడుకు ప్రాణగొడ్డమైన కార్యము సేయఁదలఁచె. దామోదరు నిట్లు సేయఁజూచెనేని తానును ప్రధానులును వినాశముఁ బొందుదురు. ఇది సేసినను, సేయకపోయినను, నమ్మహాత్మునెడ నీయపకారమును తలపెట్టిన దుష్టాత్ములు నష్టాత్ములే యగుదురు." అని పలికి యేనిట్టిదాని వినఁజాల ననుచు మొగము గంటుపెట్టుకొని దిగ్గన లేచిపోయె. ధృతరాష్ట్రుఁడును దుర్యోధనునితో "ఇటువంటి కొఱగాములు మనమునఁ దలఁచుటవలన చేటువచ్చు. ఇట్టి విచారములుడుగుము" అనిచెప్పి యాతనిని తక్కినవారిని పోఁబనిచె.

అట కుశస్థలమున శ్రీకృష్ణుఁ డక్కడివారు సగౌరవముగ ననుప గజపురికి గదలిరా, ధృతరాష్ట్రుఁడు ద్రోణ భీష్మాది బంధుమిత్త్రులను, కురుకుమారవర్గము నెదుర్కొని కొనితేఁ బుత్తెంచెను. ఇట్లు దుర్యోధనుఁ డొక్కరుఁడుదక్క, ఎల్లవారును తూర్యాది శోభనపదార్థములు సమకట్టి, ధృతరాష్ట్రుఁడు పనుప నెదుర్కొనిరి. వాసుదేవుఁడు వారలనందఱ నర్హ్యోతెఱఁగుల సంభావించి, సమస్తజనములు దన్నుఁ బరివేష్టింప గజపురము సొచ్చి రాజమార్గమున నరుగు నవసరమున, నిరుగెలఁకుల రమ్యహర్మ్యములపై నిలిచి చూచు నంగనాజనములు పుష్పములు సల్లిరి. ఆబాలవృద్ధముగు పౌరలోక మాలోకన కౌతుకమున తనరథము గదిసిన, సందడిబడియు వేత్రహస్తుల వారించుచు, నారాయణుఁడు సమ్మర్దమందగమనమునఁ జని, మణితోరణసుందరమగు రాజమందిరద్వారము ప్రవేశించి, కక్ష్యాంతరములు గడచి, యేనుఁగుల మొగసాలఁజొచ్చి, యరదముడిగ్గి, యల్లన నడచునప్పుడు, ధృతరాష్ట్రుఁడు ప్రత్యుత్థానముసేసి విదుర సంజయసహితముగా నెదుర్కొనెను. శౌరియు నాతనిఁ గౌఁగిలించి, యచట గల విదురాది శిష్టజనులను నాదరార్ద్రబంధుదృష్టిఁ జూచి పరిరంభసంభావనము లొనర్చెను. తరువాత కృష్ణుఁడు సంభాషణములకుఁ జొచ్చి రాజునకుఁ దియ్య మొసఁగెడు పూజావచనములను, బంధుమిత్త్రులకు నెయ్యంపు పలుకులను కుమారులకు మేలములను నింపుపుట్టించును కొంతసేపు

శ్రీకృష్ణుఁడు గజపురికిఁ బ్రవేశించుట

నిలిచి పుండరీకాక్షుఁడు "విదురుసదనమునకుఁ బోయెదను" అని పలికి
యాంబికేయు ననుమతివడసి యరుగ, విదురుఁడు ససంభ్రముఁడై
మంగళోపచారసహితముగా నెదుర్కొని భయభక్తివినయస్నేహానం
దములఁ గందళితుఁ డగుచు, గోవిందునకు దేవోపచారముల ననేక
ప్రకారముల నర్పనలిచ్చి, కౌంతేయులకుశల మడిగెను. కృష్ణుఁ డత
నికి పాండవుల వృత్తాంతము సమస్తమును సవిస్తరముగాఁ జెప్పిన
యనంతరము కుంతీసదనమునకుఁ జనెను. అప్పుడు విదు
రుఁడు "ఓగిర మొనగించెదను" అని తన్నడుగగ, నట్లు చేయింపుమని
యానతిచ్చెను.

పిదప శ్రీకృష్ణుఁడు కుంతిని దర్శించెను. ఆఁగొమయు మాధవు
తోడునీడయుంబోని తన కొడుకులఁ దలఁచి యడలుపుట్ట నెలుఁగెత్తి
యేడ్చిన నతఁడు సంబోధించి యూరార్ప నెట్టకేలకు కుంతి యేడ్పు
డిగి యాతనికి నాసనవిన్యాసనా ద్యుపచారముల నేయించి, తత్సమీ
పమున నుచిత పీఠమునఁ గూర్చుండి, గద్గదకంఠముతో నిట్లనియె

"మాధవా! నీకిష్టుఁ బెడఁగుట పాండుసుతులు నీతిమంతు
లును, పుణ్యపరులును శూరవరులునై ప్రసిద్ధికెక్కిరి కదా. అనేకులు
కొలువ సుఖముగా నుండు కుమారులు నిర్జనమైన కాననమున నెట్లి
డుమలఁ బడిరో! నన్నిటఁ బెట్టి నా హృదయమును గొనిపోయిరి.
నేను వడ్డింప నింపార గుడిచి, మెత్తనిశయ్యల నిద్రించి కరిబృంహిత
ముల వైతాళికుల గానరవములకు మేల్కాంచు నట్టివారు కంద
మూలము లాహారముగ, పొదలను పుట్టలను వడియుండి, పులుగు

మొకము లఱవ మేలొ్గనుచుండిరే. అయ్యో! తండ్రి లేని బిడ్డలు తల్లినిసైతము బాసి పెద్దకాల మివ్విధమున భంగపాటుఁ బడిరి. పిదప విరటుపాల దాఃఖపాటును సంకటపాటును గూడ కలిగెను."

అని తన కుమారుల సేమమరసి ద్రౌపదిని తలచి, తన యుమ్మలికము లన్నియుఁ ద్రవ్వికొని శోకము వెల్లిగొనఁ గొండొక దిగ బాటెడు చిత్తముతో మఱియు నిట్లనియె:

"ఇది మొల్లను నొకతల. ఈపదమూఁడేడులును నాకు బావ కొడుకుచే నదయుమగు కూడుగుడుచుట యది యొక తలయయ్యె! అనఘా! దుర్యోధనుని నతని తమ్ములను నాకన్న కొడుకులట్ల తలఁతుఁగాని విభేదమెన్నఁడు నామదిలేదు. దీనికి దైవము సాక్షి. ఇది నిజమైనను, నీవును పాండవులును సౌఖ్యమొందఁ జూడఁగోరెదను. కృష్ణా! అర్జునుఁడు పుట్టినప్పుడు 'వీఁడు కౌరవుల రణమున జయించును; కురురాజ్యమును పొందును' అని అశరీరవాణి పలికెను. ధర్మముకలుగునేని యిది నిక్కమగును. కృష్ణా! దానికెల్లను నిర్వాహకుఁడవు నీవు గలవుగాదె. నీమన్నించు నెచ్చెలులకుఁ జెప్పెడు మాటలు గలవు వినుము. యుధిష్ఠిరునితో నిట్లనుము:

'వేఁడికొని కృపణులై కాంచు బోఁడిమి యిదియేల? రాజపుత్రులు తమపై వాఁడిమిదప్పిన నిప్పులు వేఁడిమి సెడినట్లగును.

భీమార్జునుల కిట్లని చెప్పుము;

'రాచకూఁతురు కొడుకు నేలఁగాంచునో యట్టిపనికి నుచిత మైన సమయ మొదవెను. ఇంకఁ దడయుటొప్పదు. అట్లు మీరొన ర్పనిచో లోకము మిమ్ములను పురుషులనరు'.

'భుజబలమున జీవించుట నిజధర్మము; మెత్తఁబడుట నింద్యము' అని మాద్రేయులతోఁ జెప్పుము. కృష్ణా! పాండుపుత్త్రులు నీవు చెప్పినట్లు వినువారుకదా? ఎట్లైనను నాయలంత నార్పుము."

అనినఁ గృష్ణుఁడు గుంతి ననునయించి యిట్లనియె: "దేవీ! సుగుణవు; పుట్టినింటికి మెట్టిన యింటికిని కీర్తిఁదెచ్చిన ధన్యవు; ధీరవు అట్టి నీవే యీపగిది నడపఁజాలనిచో భువి నెవ్వరోర్వఁగలరు? నీ తనయులును కోడలును సేమమున నున్నారు. నీకధికభక్తిపూర్వక ముగ నమస్కారము లొనర్చిరి. నీకొడుకులు వీరసుఖమునే చిత్త ముల నాకాంక్షింతురు. ఒంటిసుఖములు నీకోరరు. ఉత్సాహముతో శత్రుకులోత్సాదన మొనర్చి, సామ్రాజ్యము నొంది పుత్త్రుల సుఖ మును చూతువుగాక యూరడిల్లుము."

అన విని మోమువిచ్చుచు మురారికి కుంతి యిట్లను: "పాండు నందనులకుఁ దండ్రియును, గురువును, దైవమును నీవేకదా! నీవేది ధర్మమును హితము నని విధింతువో దానినే వారాచరింతురు. నిన్నుఁ జేరినవారి కాపదయుండునా? మాధవా! వారలకేమేల? కౌరవు లకును మఱి సమస్తజగములకు నేఁడు గతి నీవ."

అనిన ప్రసన్నవదనుఁడగుచు నద్దేవి గారవించి, యామంత్ర

ణము సేసి, తదావాసము వెలువడి, తనరాకకై యలంకృతమైన దుర్యోధను మందిరమునకు కృతవర్మ సాత్యకి సమేతుఁడై పోవు గోవిందునిఁ గని, తదీయ ద్వారపాలకులు సంభ్రమమునఁ బఱచి యతని కెఱిఁగించి, తదనుమతమునఁ బఱతెంచి యొసఁగొని కక్ష్యాంతరముల సందడి నెడగలుగ జడియుచు, వినయమునఁ దోడ్కొని చనిరి. అమ్మనుజవిభుఁడును, కైలాసశిఖరాకారమగు సౌధమున బాహ్లిక భీష్మ ద్రోణ ప్రభృతులు, కర్ణ శకుని సైంధవాదులును, దుశ్శాసన వికర్ణ దుర్ముఖ ప్రముఖులును, మఱియు ననేక దేశాధీశులును పరివేష్టింపఁ బేరోలగమున సింహాసనాసీనుఁడై యున్నయెడకు జనునప్పు డా సుయోధనుఁడు సపరివారముగాఁ బ్రత్యుత్థానము సేయుచుఁ జేరనరిగి, యాలింగనాద్యుపచారముల నాచరించెను. తర్వాత మాధవుఁ డతఁ డనుపఁగఁ గనకమయోన్నత పర్యంకమునఁ దధిష్ఠించెను.

శ్రీకృష్ణుడు దుర్యోధనునితో సంభాషించుట

తదనంతరము నిజాసనాసీనులయి తన మొగమున చూడ్కి నిలిపియున్న దుర్యోధనాదులతో మాధవుఁడు మధురసంభాషణములు సేయుచుండెను. అట్టియెడ భోజనాది సపర్యలను గుఱించి చెప్పుచు సుయోధనునితోఁ గృష్ణుఁడు తా నతనితో గుడువనొల్లనని చెప్పుటయు, నతఁడు కృష్ణా! పలుదెఱఁగులగు నన్నపానములను మే మొడఁగూర్చియుండ నీ వుపయోగింప నొల్లకుండుట బాంధవమునకు నీతికిని బాహిరము. కౌరవులకును పాండవులకును నీవొక్కరూప. నీవసదృశ ధర్మా

చారుఁడవు. ధృతరాష్ట్రునకును ప్రియమైనవాఁడవు. ఇట్లయ్యు కుడువ ననుటకుఁ గారణమేమి ?"

అనిన సుయోధనున కుపేంద్రుఁడిట్లనియె : "రాయబారు లెక్కడేని, వచ్చినపని కాక మును పెదిరియింటఁ దినుటకుగాని, కొనుటకుగాని, వస్త్రములు గట్టుకొనుటకు గాని గడఁగుదురా ? ముందువచ్చిన కార్యమును తీర్చి పిదప నన్నియుఁ జేయవచ్చును."

అనిన సుయోధనుఁడు కృష్ణున కిట్లనియె : "కమలనాభా ! వేగపడుట మేలా ? కార్యము తీఱును, తీరకుండును. దాని తెఱఁగు తగిన యప్పుడాడవలెను. నీవు వచ్చిన వాఁడవు మాయింటఁ గుడిచి కూర్చుండి యెల్లపనులుఁ జెప్పుట యొప్పుఁగాక, కుడువనొల్ల ననఁ దగునా ? దీనికి కారణము నాకు తెలియదు. విచారింపఁగ పలికితిని" అనిన కృష్ణుఁడు మందస్మితముతో నందఱను గలయఁ జూచి ధార్త రాష్ట్రు కరము నల్లన కేల నమర్చి "ఇట్టిమాటలు తేటపరుపవలయు నేని వినుము." అని యతని కిట్లనియె :

"ప్రియముతోఁ బిలిచి పెట్టిన కూడు తినఁదగినది. అట్లుగాక మేలును గౌరవమును పాటింపక యాపదయందుఁ జిక్కువడిన కష్టున బాగోగుల నారయ వీలులేనప్పుడు దొరకు కూడయినను నొక విధముగా మంచిదే. కాని నీవు మాయెడఁ బ్రియుఁడవు కావు. మాకో ధైర్యము కోల్పోయి యాచించు నంతటి యాపదయు నే మాత్రము లేదు. అంతియకాక పగవారియింట నమృతము తిన్నను ననుమాన మగును. తానునుఁ బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ దగదు.

శరీరమునకు నెప్పు డెట్టి వికారము కల్గునో? పాండవులు నాకు ప్రాణములు. నీవు వారికి పగతుఁడవు. నిష్కారణముగ బాల్యము నాఁటినుండియు కౌంతేయులకు కీడు నాచరింతువు. వారు పుణ్యపురుషులు; నీతోడఁ బుట్టువులు. వారితో నీకు వైరము తగునా? ఇట్లున్న మీ యందలి యన్నములును దుష్టాన్నములు. విదురునియన్నమొక్కటియె భోక్తవ్యమని నిశ్చయించితిని. కావున నందు బోయెదను" అని చెప్పి యజ్ఞసపతి యనుమతి సేయ, నందఱను సంభావించి విదురుగృహమునకుఁ బోయెను. విదురుఁడును సంభ్రమస్నేహ నిశ్చల భక్తి యుక్తిని హరికి మజ్జనము గావించి, సపరివారముగ పుండరీకాక్షుఁడును, దమ్ముఁడును దానును చతుర్విధహృద్యాన్నముల నారగించిరి. ఇట్లు కృతాహారుఁడైన హరికి విదురుఁడు చందన చర్చాద్యర్చనములాచరించెను. అంత రాత్రియగుటయుఁ దగిన యాభ్యంతరమందిరమున హంసతూలికాతల్పమున కృష్ణునునిచి యతనికడ నుచితాసనమునందుండి విదురుఁ డిట్లనియె:

"కృష్ణా! ఇదియొక పెద్దకార్యముగాఁ బూనివచ్చితివా? దుర్యోధనుఁడు దుష్టబుద్ధి; నీచుఁడు; దురభిమానధనుఁడు. అతఁడు నీమాట వినునె? భీష్మద్రోణుల లావుఁ జూచి యతఁడు గర్వించి యున్నాఁడు. కర్ణుఁ డొక్కఁడే తనకు విజయము నిచ్చునని యెంతయుఁ బొంగుచున్నాఁడు. నీవిట వచ్చుట వినినప్పుడు ధార్తరాష్ట్రులందఱుఁ గూడబాఱి తమలో యుద్ధమునే నిశ్చయించుకొనిరి. దిగ్విజయము నాఁడు పాండవులచేత భంగపడిన రాజులెల్లరు వారిని గూడిరి. అట్ల

గుట దుర్యోధనుఁడు గంపమిగిలియున్నవాఁడు. సంధి కానేరదు.
వారల కందఱకు ప్రాప్తకాలమైయున్నది. ఇట్టి తమ్ముఁగని దుష్టా
త్ముల నడుమఁ గూర్చుండుటయు, అవ్వేంగలి పిత్తులఱవు నీలిబిడి
యఱపులకు ఎంకరొత్తి మాఱుసెప్పుటయును నొప్పదు. వెడగు
లగుటచేఁ గార్యవచనము తెలియఁగరు. మొఱకులగుటచేఁ బ్రతాప
భాషణములకు వెఱవరు. పంపిలతలఁపులు గీడు. సీసుహానీలగు ప్రభావ
బుద్ధి పౌరుషములను నే నెఱుఁగుదును. అయినను పాండవేయులపై
స్నేహమునను నీవిగూఢిధ క్తిచే 'వ్యాసనుఁ జెప్పెద; అందుఁబోవలవదు."

అనిన వాసుదేవుఁ డతని కిట్లనియె:

"నీవు నీ వివేకమును, నా ప్రీతియు నెఱపితివి. శక్తిదంస్త్రులవలె
హితము సెప్పితివి. నాకాక తెలియఁగఁ జెప్పెద, దాని నాలకించి
యేమిసేయనగునో చెప్పుము. నీవు చెప్పినట్లు చేయుదును. మహాత్మా!
సుయోధను కొఱగామియు, నాతనితోఁ గూడిన నృపులందఱుఁ
బగ మనమున నిడికొని యుఱుముటయు, సంధి పొసఁగదనియు నేనె
ఱుఁగుదును. అనఘచరిత్రా! భూమిసంతతను తలక్రిందుగాఁజేయు మహా
సంగ్రామ క్షోభమును మార్చుట పుణ్యముకదా! చుట్టములలో
నొప్పుమి పుట్టినప్పు డడ్డపడి, వారితోఁ గొట్లాడియున దాని యుడుఁ
పఁగఁ జూరకొన్న వానిని కర్మకాండవిదులు న్నరకప్పుడని చెప్పు
దురు. కావున నీ రెండు తెలుంగుల వారికి శాంతి గావింపఁ బ్రయత్నము
సేయుదును. ధర్మార్థసహితమైన మాటలు మంత్రిజన సహితుఁడగు

సుయోధనునకుఁ జెప్పెదను. తనకును, పాండునందనులకును, లోకము నకును, హితమైన విధమున వంచనలేక చెప్పెడు నన్నుఁ బాండవుల వాఁడని శంకించి యీతఁడు నామాట వినఁడయ్యెనేనియు మేలగాక. ఇట్లు సొచ్చి చెప్పకున్న 'అన్నదమ్ములు దమలోఁ బోరఁగ గృష్ణుఁడు వారింపక యుపేక్షించె. తనచేతఁ జక్కఁబడదా' యని యజ్ఞులైన జనులాడుదురు. ఎల్లభంగులఁ గార్య మార్యు లియ్యకొనునట్లు చెప్పె దను. ధార్తరాష్ట్రులును దమకు బ్రతుకు తెరువైన నావలుకులు విందురు. వినక నీవు తలంచినచందమునఁ గాలువవలై కలఁగఁబాఱిన వారు నా ముందఱ నిలువఁ జాలుదురే ?" అని పలికిన, విదురుఁడు 'అట్లగాక' యని సమ్మతించి, యామంత్రణముసేసి నిజశయన స్థానమునకుఁ జనియె ;

మఱునాఁడుదయమున కర్ణ శకుని దుశ్శాసన సహితముగా సుయోధనుండు కృష్ణుని దర్శించెను. ఇట్లు కొంతసేపు సల్లాపములాడి ధృతరాష్ట్రుండును బంధుమిత్త్రాది సమస్త పరిజన సమన్వితుండై, పేరోల గమున నుంట నెఱింగి, ప్రియకుసు గట్టాయితమైన తేరెక్కి, భేరీ శంఖచామర ప్రముఖ భద్ర చిహ్నములతో వెడలి గరుడ ధ్వజము గ్రాల, కృతవర్మ సాత్యకులొక రథమునను, దుర్యోధనాది చతుష్టయము నొక రథమునను, పార్శ్వముల రాఁగా పౌరు లకుఁ గన్నుల పండువగుచు రాజమందిరద్వారముసేర నరుగు నప్పటి యులివునకుఁ గొలువువారెల్లరు సత్యుత్సుకులై యెదురు చూడ, రథోత్తము నవతరించి, యరవిందనాభుఁ డెదురువచ్చిన విదు

రుని కరమును, తమ్మునిచేయియు తన రెండు హస్తములఁ బట్టి నడచెను. అప్పు డతని సమీపమునఁ గౌరవులు రవిసన్నిధిఁ దారా గ్రహముల చందమగుచుండ, తేజోరాశియగు రాజీవాక్షుఁడు సని, తనకుఁ బ్రత్యుత్థానము సేసిన కురురాజును దొరలను నభినందించుచు తనకై పెట్టిన మణిమయ కనకోన్నతపీఠమున నిల్చెను. అంత నంతరి క్షమున నుజ్జ్వలులై నారదాది మహామునులు తోఁచిరి. ఇవ్విధమున సన్నిహితులైన యమ్మహామునులఁ గురుపితామహునకుఁ జూపి నారా యణుఁ డిట్లనియె:

"మనలఁ జూచు వేడ్కను మహాత్ములైన నారదాది మును లరుదెంచినారు. వీరి కర్ఘ్యపాద్య విధు లొనరింపుము; సత్వరముగ నాసనము లిడఁగఁ బనుపుము. వీరలు సముచితాసనముల నుండక మనము కూర్చుండుట దగవుగాదు." అనిన కొలువువారెల్ల సంభ్ర మాశ్చర్యములతో మునులను చూచుచుండ, భీష్ముఁడు పరి చారకులఁ బనిచి కనకమణిమయాసనము లనేకములు తెప్పింప, వార లరుగుదెంచిన, వారలకు నమస్కరించి, యాసనార్ఘ్య పాద్యాది విధులఁ బూజలం జేయించి, కృష్ణుఁడు కూర్చున్న పిదప, ధృతరాష్ట్రుఁడును తక్కిటివారును నుచిత ప్రకారముల నమ్మునీంద్రులకు నభినందనము సేసి నిజాసీనులైరి. దుశ్శాసనుఁడును వివింశతియును గద్దియ లిడ సాత్యకియును కృతవర్మయును కృష్ణుని యిరువంకలను కూర్చుండిరి. కర్ణ దుర్యోధనులు చేరువ నొక గద్దియ నుండిరి. విదురుఁడును మణిపీఠమున కృష్ణుని వెనుకవైపు నుండెను.

గాంధారరాజు నిజపుత్ర పరివృతుఁడై యొక దిక్కున నుచిత పీఠాసీనుఁడయ్యె.

అట్టి సమయమున నాకొలువువారు నిశ్చలముగ కృష్ణుఁ జూచుచు నవశముదాకాంతచిత్తవృత్తులై యుండిరి. అంత ముకుందుఁడు జలదస్వనగంభీరత నెలుఁగొప్పఁగ ధృతరాష్ట్ర భూవిభున

శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునితో సంభాషించుట

కిట్లనియె: "జననాథా! నీవెఱుఁగని ధర్మములు గలవె? భారతాన్వయము ప్రియమొంద తగవును హితమును తనవారికిఁ జెప్పనగునని వచ్చితిని. పాండవ కౌరవులు క్షీరోదకముల గతి నొడఁగూడి మనుట మంచిది. కురుముఖ్యా! నీకు వారును వీరును నొక్కరూప కాదె? భరతకులము ధర్మమును, పాడియును, సత్యమును, పొత్తును, పెంపును, కరుణయు గల్గియుండుననఁగా నుతిఁ గన్నది. అందులో నీవును నీతమ్ముఁడును సద్గుణోత్తరులరు; నీతనయులు యశోధురంధరులు; శుభశీలురు. ఇప్పుడే సుచరిత్ర క్రమమును తప్పఁగునే? కురువంశాగ్రణీ! ఈ వంశమున కెల్ల నీవ కుదురవు. ఇందెవ్వరెట్లుండినను, కీడైనను మేలైనను తుదకు నిన్నే చెందును కాన సద్భావ మరసి యెవ్విధమునైనను లోనిపొత్తును, వెలివృత్తమును జనస్తుత్యమగునట్లు కావించుట నీవిధి. సుయోధనాదులు సధర్ములు కాక, సంధివలననే తమకు మహార్థసిద్ధియగునని తలపక, తమ వంశవర్తన మిది కాదనియైన నెంచక బంధుకోటి మనసులు నొప్పించుటకు వెనుదీయరు. కౌరవపాండవులు శాంతత బొందియుండుట నీకును, నాకును, కులమంతకును, నీ ప్రజ

కోటికిని, వేయేల యుర్వియంతకును మేలు. యుద్ధమైనచో జగత్త
తటికిని మహాపద వాటిల్లును. అంగుచే, రాజా! ఎట్లైనను తప్పని
పొందొనర్పుము. నీవు తలంచినచో వీరినయేల యుర్విజనుల సంద
అను తీర్ప సమర్థుఁడవు.

ఇంక పరస్పరబలములంగావా : పాండవుల పక్షమున భీమా
ర్జునుల వంటి పరాక్రమశాలు లెందరో యున్నారు. ఇక్కడ భీష్మ
ద్రోణులను మించిన మరియొక వీరుని చూపుమా! ఇంతయును, వీరం
దఱు యుద్ధమున చచ్చుటకంటె నీ బలమునై యుండఁగను కూడి
యుండుట తగదా. జనాధిపా! ఎట్లైనను శాంతినొనర్పుము.

"జగతింగల జనపతులు నీ చరణపీఠమును గొలువ సముద్ర
వేలావృతోర్వియెల్ల నేలుట యొప్పదే? నరనాథా! అగ్రగామి నీ
వుపేక్షాపరుఁడవైనచోఁ కౌరవులకును పాండవులకును మాత్రమే
కాదు, సమస్త భూప్రజలకును ద్రోహ మొనగించినవాఁడవగుదువు.
రాజా! కౌరవపాండవులలో నెవరు చచ్చినను నీకే దుఃఖమగును
కదా. వీరును వారును పండితులు, విక్రమవంతులు, బాహుగర్వ
దుర్వారులు. ఇట్టివారు పట్టి పోరాటములలో వ్యర్థముగాఁ జావఁ
బోవ నూరక ఎట్లుండనగును? రాజా! అట్టి దురంతము గలుగకుండ
నీవు రెండుపక్షములవారినిఁ గాచికొనుము.

పాండవులు తండ్రి లేని బిడ్డలు. శైశవమునాదిగా నీవు వారినిఁ
బోషించితివి. నడుమ నిష్కారణముగ దిగవిడువదగునా? తుది

వఱకు వారిని రక్షింపుము—పాండుకుమారులు నీకుఁ బరమభక్తులు. అందఱు నొక్కమాటగా నీతోఁ జెప్పుమని నాకుఁ జెప్పిన విధము వినుము: "తమపెంపునఁ బన్నెండు వత్సరములు వనమున వసించితిమి. పదమూఁడగు నేఁడు జనపదమున నజ్ఞాతవాసము సలిపితిమి. మాతండ్రి సమయము పరిపాలించి యేమర్ధరాజ్య మెట్లునుఁ బడయుదుమని కృతనిశ్చయులమై పడరానిపాట్లెల్ల పడితిమి. తల్లియుఁ దండ్రియు నెల్ల చుట్టంబులును, నేఁగుగడయును మాకు తాన. మావలన నేరము గల్గినఁ గినిసి 'ఇట్లు కాదు, ఇట్లు' అని చక్కఁబెట్టునది. మేమెట్టివారమైనను మమ్మును దుర్యోధనాదులు తలఁపరు. తనయందుఁ దెలుఁగు గలిగిన నెవ్వరు గొఱగాకున్నను కులము పాడి చెడక చెల్లును" అనిరి.

అంతేకాక సభ్యుల నుద్దేశించి వారు చెప్పుమనిన మాటలు: "పవిత్రమగు ధర్మమును, విమలమగు సత్యమును పాపముచేతను రోగముచేతను చెడవు. ఎవ్వరు ధర్మమార్గమును విడువఁజూతురో వారికిఁ జేటు తప్పదు. ఇంక ధర్మమును తరింపఁజేయుటకును, సత్యమును శుభావహముగఁ జేయుటకును దైవమే కలదు."

ఇప్పుడు దీనికి నీవును సభాసదులైన రాజులు నేమనియెదరో యనుఁడు. నేను ధర్మమును నీతియును మున్నిడుకొని మనోవాక్ప్రికారము లేక సూపున సత్యంబుగాఁ జెప్పితిని. ఈ తెలుఁగు మీకు మేలు. క్రోధమాన మత్సరములు విడిచి యిట్లు సేయుఁడు పాండవు

లకుఁ దగినపాలు మేదినిఁ బంచి యిచ్చుటకంటె ధర్మమెద్ది కలదో మీరే చెప్పుఁడు”

అని శ్రీకృష్ణుఁడు తిరిగి ధృతరాష్ట్రు నుద్దేశించి యిట్లనియె: “మహారాజా! వారి తండ్రి పాలు వారికిచ్చి నీపాలు నీవును నీ పుత్త్ర పౌత్త్ర చయమును ననుభవించి సుఖులరై యుండుఁడు. ఇది బంధుమిత్త్ర సుజనకోటి మెచ్చు విధము. అధిపా! అజాత శత్రుని ధర్మబుద్ధియు, సత్యనిష్ఠయు నీవెఱుఁగవా? మిమ్ముల నెట్లను వర్తించెనో యెఱుఁగవే? అతనికి తగు చేవ గలిగియు నిట్లు చేసెను కదా. ఇదంతయు నీవెఱుఁగుదువు. వినను చెప్పెద వినుము. ఇంద్ర ప్రస్థపురము నందుండి పాండవాగ్రజుఁడు నీకుఁ జెప్పనుఁ బేరునుఁ జేయఁగోరి దిగ్విజయ మొనర్చెను. అట్టి మహావిభవముతో నున్న ధర్మజుని నీసుతుఁడును, మంత్రులును జూదమున నోడించి యతని సంపద నంతటిని గొని యంతఃపురవక సభలో ద్రుపదాత్మజను భంగపెట్టరా? దానికి నీవొడంబడితివి. ధర్మజుఁడంతయుఁ జూచి సత్యమును బూని, పదుమూఁడేఁడు లుగ్రవనములఁ గడపియు మీతో స్నేహభావమున మెలఁగఁ జూచుచున్నాఁడు. సౌజన్యనిధి! అజాత శత్రు నతి శాంతతయును, వినయమును, గౌరవమును నేజసహితులకు గలవో చెప్పుము! అతని కతఁడేసాటి.

“మహారాజా! నీసంతానము హితముఁ గోరి నేనింతగా చెప్పితిని. నీసూనుని యతి లోభమును మార్చి పాండవులను తెమ్ము. వారు శాంతశీలురు. నీ చరణ సేవను సేయఁ బూనియున్నారు.

వారితో సంధి చేసుకొన నిచ్చగింపవేని వారును యుద్ధమునకు సిద్ధము గనే యున్నారు. భూవరా! రెండుపక్షముల వారికిని నేది శుభావహమో దానిని నీవే నిశ్చయింపుము."

అన సభ్యులందఱును శ్రీకృష్ణుని న్యాయబుద్ధిని ధీరత్వమును మెచ్చిరి. అప్పుడు జామదగ్న్య మహాముని సుయోధనునితో నిట్లనియె :

"పూర్వము దంభోద్భవుఁడను రాజు తన కీడు వారెవ్వరును లేరని క్రొవ్వి, నరనారాయణులనువారు గంధమాదన పర్వతముపైఁ దపము సేయుచుండ, వారిపైఁ జని యాహవమునకుఁ బిలిచిన నమ్మునీంద్రులు వలదని యనేకవిధములఁ జెప్ప తిరిగిపోకున్న వారు దర్భ పిడికిలితో శీఘ్రతమమగు సంపవాన గురిపించిరి. దానితో నతనిసేన హతమయ్యెను. ఆమహాత్ములిప్పుడు శ్రీకృష్ణార్జునులై లీలార్థకలిత జన్ములైరి. కావున నాదంభోద్భవు చందమున నుద్ధతి వాటించుటయు నరనారాయణుల తోడఁ దొడరుటయు మిాదమేలయి యుండదు. పాండవులతోడి పొందుమేలు." అనిన యనంతరము కణ్వుఁడు దుర్యోధనున కిట్లనియె. తనబలమును, నెదిరిబలమును నెఱుఁగక నిగ్రహించి మదమెత్తుట యెప్పుడు, అహంకారము పౌరుషహాని యొనర్చును" అని గరుత్మంతుని వృత్తాంతమును చెప్పి మరియు "దుర్యోధనా! ఎట్టివారికిని నిర్బంధము తగదు. దుర్మానము దుర్దశ నాపాదించును. అందుచేఁ గృష్ణునిమాట విని సంధిగావించుకొనుము, కౌరవాన్వయమును రక్షింపుము" అని యూరకుండెను.

ఇవ్విధమున నమ్మునీంద్రులుసెప్పిన హితోపదేశములవిని నవా దరమునేసి, గాంధారేయుఁడు రాధేయుఁ గనుగొని చేయుప్పళించి, నవ్వి " వీర లింత వెఱ్ఱులగుదురే ! " అని పలికి వారల నవలోకించి; " మునులార ! మున్ను విధి యేమని పుట్టించెనో యట్లయ్యెనుఁ గాని యిట్టిమాటలతో నేమిపని? " అనిన విని ధృతరాష్ట్రుఁ డమ్మహా మునులతో నిట్లనియె: " మీరుసెప్పిన బుద్ధుల ననుసరించు పుణ్యము నకు నేను నోఁచుకొనలేదు. నే నేమిసేయుదును ? నా ముఖమునఁ గార్యము నడువదు. ఏమి సేయువాఁడను ?" అని తిరిగి కృష్ణునుద్దేశించి " అనఘా ! నీవు చెప్పినది యిహపరములు గలుగునట్టి విధము. కాని నా నందనుఁడు మందబుద్ధి. నీవో చుట్టమవు; మహానుభావుఁడవు; దయార్ద్రచిత్తుఁడవు. కృష్ణా ! ఎట్టులైన ననునయించి వీనిఁదేర్పవే ?"

అనిన ముకుందుఁడు దుర్యోధనునితో నిట్లనియె : సుయోధనా ! విమలతరమగు వంశమున జన్మించితివి. ఎల్లగుణముల ననూనుఁడవు. నీ కీ దురాగ్రహముచితమే ? ఇట్టి దుర్నయవృత్తి తులువలకు తగునుగాని నీ కుచితమా ? పుత్రులు, ననుజులుఁ జెలులు దుష్పథమునఁ బోవకుండఁ దండ్రియు బంధువులు నొడఁబడునట్లు ప్రవర్తింపుము - అల్పబుద్ధుల వెడమాటల కూఁకొనకుము. అట్లు చేయుటవలన దోషము సంభవించును. పాండుపుత్రులు పాండిత్య శౌర్యనిత్యులు. ధృతరాష్ట్ర బాహ్లిక భీష్మ ద్రోణులు పాండవులఁగూడి బ్రదుకుటయ మేలని తలఁచువారు. సుయోధనా ! అసత్యలోభమున సిరియగునే ? ఆఁ కొని మిసిందినిన బలమువచ్చునే ? శకుని కర్ణ

దుశ్శాసన మంత్రితము గార్యతంత్రమగునె? తోడఁబుట్టిన భీమపార్థుల పరాక్రమము నొల్లక బలహీనులగు నితరుల తోడ్పాటు నర్థింతువు. పాండుసుతులఁ బీడించుచున్నావు, సుయోధనా! వినుము. నీ వేమి చేసినను వారు సత్యమును ధర్మమును తప్పరు. ఒకప్పుడుఁ గినియరు. నీవు వారిబంధుత్వము నేల నొల్లవో? వారును మీరును క్షీరనీరములవలె కలసిమెలసి యుండుట నిచ్ఛయింపక నీ కీర్ష్యారేగునట్లు నేర్పి యిప్పుడు పొందుపాటును తప్పింపఁజూచువీరు యుద్ధమువచ్చినప్పుడెదిరించి నిలువగలంతటి సమర్థులా? వీరేకారు - పాండవులను యుద్ధమున మార్కొన సురాసురులకును సాధ్యముగాదు - సుయోధనా! అనుచే వారితో కయ్యమునకుఁ గాలుఁ ద్రవ్వకుము. సంధి యొడగూర్పుము.

"జ్ఞాపకముంచుకొనుము. ఈ రాజులెల్లరును వాయుసుతున కొక్కమొత్తు. అతఁడలిగిన శూలాయుధుఁడుసైతము వడఁకును నీవు ధీరవిచారుఁడవు. సుయోధనా! పాండవులతోడి వైరముడుగుము-

"ఒక్కమాట చెప్పెదను - మీ సకలబలములందును సవ్యసాచి కెదురుగా నొకఁడుగల్గిన యుద్ధమునకుఁ బంపుడు. రిత్త బహుజనక్షయమేల?

"పెక్కండ్రు గోవులఁగొని యుక్కుమిగిలి నడచుచుండగా నరుఁడొక్కఁడువచ్చి యాలను విడిపింపఁడా? ఇది ప్రసిద్ధమేగదా?

"తోడు లేనప్పుడు సవ్యసాచి సామర్థ్యమట్టిది. సుయోధనా! కినియొక విషయము. నే నతనికెదురైరా నెదుర్కొనుట కెవరికి సాధ్యము. అందుచే యుద్ధము నుడుగుము. జయము దుర్లభము. అనుజతనుజులు మిత్రబాంధవులు నీకై నశించిపోగలరు. రాజు కులనాశనుఁడనిపించుకొనరాదు. సుయోధనా! అందుచేఁ బాండవులతో నొడఁగూడి బ్రదుకుము.

"రాజ్యభారము ధృతరాష్ట్రభూపతి యందు వెలుఁగుచుండ నీవు యువరాజవై యుండఁ బాండవులు తంస్త్రిచిత్తముల్గ సిల్లసగ్గ సేవించుచుండుటయే సామ్రాజ్యముగాఁ దలతురు.

"కౌరవనాయకా! పాండుకుమారులు నీతోడు పొత్తును వాంఛించుచుండ నీవు వలదనుట సిరి రా మోకాలొడ్డుటగాదె?"

అనవిని సుయోధనునితో భీష్ముఁడిట్లనియె:

"సుయోధనా! నీతండ్రిమాట వినుము. బుధవత్సలుఁడగు హరి ప్రసన్నమతియై యిటకువచ్చి యిట్లుసెప్పగా వినకపోవుట మంచిదికాదు. పెద్దలమాటవినుము. ధృతరాష్ట్రుఁడు బ్రదికియుండగా బంధునాశము, రాజ్యశ్రీ నాశము, యశోనాశముఁ జేయఁ జూచెదవేల? కృష్ణార్జునులతోడి విరోధ మీ బంధులోకమునకకాదు, లోకమునఁ నెవ్వరికినిఁ జూడఁ బోవదు. లోకహానిఁ గానీయక కూడి బ్రదుకుటమేలు," అనినఁ దద నంతరము ద్రోణాచార్యుఁడు సుయోధనున కిట్లనియె: "కుమార!

*భీష్మద్రోణులు దుర్యోధనునకు హితముచెప్పుట*

పితృపితామహగురులమై ప్రీతిఁ గోరుచున్న యట్టి మా పరమహితోప దేశవాక్యములు విని, దుర్జనుల మాటలు వినక, బంధువులతో నొడఁగూడి మనుము వెన్నుఁడు ప్రీతింజెప్పిన త్రోవఁబోయిన నీకాయు వును శ్రీయుఁదక్కు-ను. మాకన్నులు చల్లగా మిమ్ములఁ జూచు కొందుము. ఇఁక పైన నీయిష్టము. నిందుకొల్లవేని నిన్ను మ రేమియు ననఁజాలము."

పిదప ధృతరాష్ట్రుఁడు నిజాత్మజు దిక్కు-మొగముసేసి యిట్ల నెను: "పుత్రా! హరినాశ్రయించి నీ యగ్రజుఁడగు నజాతశత్రునిఁ జూడుము. దాన మనకార్యములన్నియు సిద్ధినొందును. శ్రీకృష్ణుని పలుకాదరింపనిచోఁ బదంపడి యెల్లచేటులును వాటిల్లును."

అట్టియెడ గురుభీష్ములార్తి చెప్పఁదలఁచి గాంధారేయునకిట్ల నిరి: "మహారాజా! ఈ కురువంశమును కావుము. వారును మీరును బాంధవమునఁబొదలి, తామరతంపరై, చెలులును, చుట్టములును కలసి మెలసియుండ నెంత బాగుండును? సమరమునకువచ్చిన భూపతులు తమతమపురములకు సుఖముగాఁబోయిన మహీజు లెట్టియుత్సవముఁ బొందుదురో?" అని మెండియు ననేకవిధములఁజెప్పి "ఈ రెండు తెగలగులవారును బంధికొని కడకు సుఖమున్న నఖిలభూప్రజకును బ్రమోదమగు. కావున నట్లుసేసి నీవందఱచేత దీవనలు వడయవయ్యా." అనిన విని దుర్యోధనుఁ డప్పుండరీకాక్షు వీక్షించి యిట్లనియె:

"గురుఁడును, పితామహుఁడును, నీ నరధునాఁడును నెల్లప్రొద్దు నను దూఱుదురు. ఇప్పుడుసున, దామోదర! నీవును మాతొదవు

కాని తగవుఁదలఁపవు. 'వనితను భంగపాటొనర్చిరి. అగణ్యకుల నిను
మలఁబడితిమి' అనుచుఁ బోటరులై చంపనుఁ జెలుగుచును దలఁచి
యకారణముగ నపాండుసుతులు మూఁదెసఁగనలుదురు. నా వలన
నొకయింతయుఁ దప్పు లేదు. ఆ ధర్మజుఁడు జూదరివాఁడు దనుకించి,
జూబలువలన రాజ్యముఁ బోగొట్టుకొని, ముమ్మఱుఁడై వెండియు
నొడ్డఁగా నతఁడత్యప్రాథిస్మైగెల్చెను. ఏ తెరువైననుఁ దనయిచ్ఛతోఁ
బడితిమి. దీనికి నేనా బాధ్యుఁడను ? మాత్స్యపాంచాల పాండ్యాది
మనుజపతులఁ గూర్చికొని తాము కయ్యముఁగోరి వివసిరి. ఇంతియే
కాని యివ్విధమున నుగ్రకర్మమున కేము దొడఁగుటగలదె ? ఉక్కఱి
సురపతికైనను మ్రొక్కఁము. క్షత్రియధర్మమూఁది యుద్ధమొనర్చిన
నిక్కఁడయశమును, పరలోకమున స్వర్గమును గలుగును. ఉపేంద్రా !
చిన్న నాఁడుదితాను చితజ్ఞతలేక యట్లు సాగనిచ్చితినిగాక ! ఇప్పుడు
తాతయుఁదండ్రియు నాబలము నెఱుఁగక, పగ తెగుటకై పాండవులకు
రాజ్యము సగముపంచి యియ్యఁదలఁచిన నది నేనేటికి సమ్మతింతును?
మేమును వారునుఁ బంచికొని యేలుటగల్గదు. ఇంకేమియు బల్కఁ
కుందుము. వాఁడి సూది మొనమోపినంత మాత్రము భూమియేని
పాండవులకేనియ్యను. ఎవ్వరైనను సరియె, సంగ్రామమునఁ జయముఁ
గొని రాజ్యము సేయవలెనని నిశ్చయించితిని."

అనిన విని కినుకఁబూనిన యలఁతినగవు చెలువు మొగమున
నొకకొంత తపాలుపొనర్పఁ బుండరీకాక్షుఁ డరుణకమలాక్షుఁడగుచు
నిట్లనియె : "నీచెప్పిన యట్టుల యుద్ధమొనర్తుము; తడవులేదు. వీరు

దులకై నీవును వీరును నిలువుఁడు; యుద్ధము రేపయగును. అతి యట్టులుండెఁ. నీవలన నేమియుఁ దప్పు లేదంటివి. నీవొకనాఁడు కీడు సేసి యొకనాఁడొనర్పవే? నీవు జనించినయాదిగాఁ బాండవేయు లకుఁ జాల నిగ్రహ సేసితివి. మఱియు పెనుబాముల గఱపించి, నీటిలోఁ గట్టిత్రోచి, లక్క-యిలుగాల్చి, పెక్కు-విధములఁ జంపదలచితివి. కాని వారు ధర్మరక్షవలనఁ జావక నిలిచిరి. తర్వాత వారు రాజ్యముఁ బొందియుండఁగాఁ జూపోపక తీవ్ర పాపబుద్ధిని జూద మొకటికల్పించి కపటముసేయ దానవల్ల చేటుఁ బుట్టె.

అన్నదమ్ములు నెత్తములాడి, సతుల తలలు పట్టి సభాస్థలము లకు నీడ్చి చీరలొలిపింతురే? నీవొకఁడవు తప్ప నిట్టి వారెందైన నుందురా? నాఁడు నీవునుఁ గర్ణుఁడును నాడినమాటలు కొల్వులో చెప్పెడు నట్టివా? గుణమును శీలమును గలిగిన పుణ్యకాంత నిట్లు చేసియు 'నాడిన తప్పేమియు లేదు' అనుట నీకచను. పైపెచ్చు త్రివిడిసినవారని యెల్లతప్పు పాండవులమీఁదఁ బెట్టుచున్నావు. అంతియే కాని భీష్మద్రోణులునుఁ దండ్రియుఁ జెప్పు మాటలు చెవి గొన్నవు. కుమారా! వినుము. శాంతిఁ బొందుట నీకును కుంతీ పుత్రులకును మేలగును. నీకీ మాటలును రుచింపవని తెలిసియు మీ మేముఁ గోరియే నేనింతగా మాటలాడితిని."

అని యిట్లు నారాయణుఁడు నానాప్రకారములఁ జెప్పుటకుఁ గటకటంబడియెడి దుర్యోధనునకు దుశ్శాసనుఁడిట్లనియె:

"జనకుఁడును గురుభీష్ములును నీకుఁ బ్రీతినేయరు. ఇచ్చట నీవుండుట తగదు" అనగానే, దుర్యోధనుఁడు కురవృద్ధులను, జనకునిఁ గృష్ణుని సైత మాదరింపక రాజసమున దిగ్గనలేచిపోయె. కొలువు సంచలించెను. అతనివెనుకనే కర్ణుఁడునుఁ దక్కిన కౌరవులును, శకునియు వారి పొందైన జనపతులునుఁ బోయిరి. అట్లుపోయి వారంద రును నొక్క ప్రోవుఁగట్టి పరిహాసప్రసంగమున నుండిరి.

ఇట్లున్నఁ గనుంగొని గాంగేయుఁడు "దుర్యోధనుఁడు దాను రాజని క్రొవ్వి, వృథాభిమానియై, మతిచెడి, లోభమోహామద మత్సరములు దనుఁద్రిప్ప నిట్లసంగతముగ నేలపోయె? ఏమిదలఁచెనో మహీపతులునుఁ గొంద ఱతనివెనుకఁజనిరి. వీరిలోఁ గొందఱు పెద్దమనుష్యులు. ఏమిచేయుదును?" అని ప్రకాశముగ జనార్దనుఁ గనుఁగొని "అకట! ఈ నరపతులందఱకుఁ గాలపక్వమయ్యె" ననుడు, శ్రీకృష్ణుఁడు తగువారి దెసఁగలయఁజూచి యిట్లనియె: "ఈ దుర్యోధనుఁ డింతగర్వియా? ఈ యున్నవారెల్ల నాచే దైన్యమును బొందు టొప్పదని యూహింపడు. ఈతని మనోరోగము మాన్ప మందులేదా? ఈ జాతికి భేదమింకఁ బోదా? కురువీరులారా! సత్కులముఁ బాలించుటకు దుష్టాత్మకుఁడును నీచుఁడును నగు నొక్కని వర్జింపరాదే? నేనును మున్నట్లే చేసితిని. మా మామయగు కంసుఁడు నితనియట్ల మా తండ్రిమది గుండెదు చందమొనర్చి ధర్మవిధ్వంసముఁ జేయఁగాఁ గులమువారలు నా కెఱిఁగింప, నేను దుర్మాంసముఁగోయు వైద్యునివలె, నాతనిఁద్రుంచి, జనకుని నన్వయోత్తంసముఁ జేయనే?

మీరునట్లు చేయుటయొప్పరా ? దానితో నెల్లయాపదలును తీఱును; వంశము గౌరవమునొందును; కురుపాండవులకుఁగూడి మనుటగల్గును."

అనినవిని ధృతరాష్ట్రుఁ డదరిపడి విదురున కిట్లనియె : "గాంధారి బుద్ధిమంతురాలు; పొందుగఁ బలుకనేర్చును; ఆమె వచ్చి కొడుకును దేర్చిపోవును. కాన నీవామెను వేగఁ దోడితెమ్ము." ధృతరాష్ట్రుని యాజ్ఞ ననుసరించి విదురుఁడును నట్లు చేసె. అద్దేవియు నరుదెంచి యుచితపీఠమున నుండఁ గురువిభుఁ డామెతో నిట్లనియె : "నీ తనూభవుఁడు దుర్వినయమున జనియె. ఇట్టి వెంగలి యొంపైనఁ గలఁడే? నీవైన నతనిని నచ్చజెప్పి శాంతింపఁజేతువేని కౌరవకులము గోవిందు శాసనము సంభావింప గాంచి చెడక బ్రతుకును."

ఇదివిని గాంధారి "అధిపా ! నీపుత్త్రుఁడవివేకుఁడగుట యెఱిఁగి యెఱిఁగి వాని వశమున నేలపోయెదవు? నీవు పాండవులకేమి యిచ్చినను నడ్డపడ నెవ్వరికి వచ్చును?" అని చెప్పి గాంధారి నందను బిలువ విదురుని నంపెను. దుర్యోధనుఁడును మొగము జేవుఱింప విదుర సంప్రార్థితుఁడై సభకుఁ జనుదెంచెను. మున్ను దనతోఁ జనిన వారలందఱు నచ్చోటన నిలువ, నిట్లువచ్చి సుయోధనుఁడు నిజాసనాసీనుఁడై యున్నఁ జూచి, తల్లి చిత్తమున గర్హించుచు, నతనికి ధర్మమును, నీతియునుఁ జుట్టఱికమును, బ్రతుకుఁదెరువును, నిజశక్తియు, సహాయము కొలందియుఁ గులజనచిత్తప్రకారమునుఁ బాండుపుత్త్రుల బల పరాక్రమములునుఁ దెలియునట్లుగాఁ జెప్పి బుజ్జగించియు, గినిసియు ననేకవిధములఁ జెప్పెను. సుయోధనుఁడామాటలదెస ననాదరము

సేసి, యుద్ధతంత్రమ్ములఁ బని యతఁడు కర్ణాదులఁ గలసి, వారును దానును దుర్మంత్రమునకుఁ జొచ్చి యిట్లు తలపోసికొనిరి.

“హరి తలఁపోప్పును. అతఁడు భీష్మునిని, గురునిఁ గూర్చుకొని మనలఁ గ్రొవ్వాఁడఁ బట్ట నుత్సహించుచున్నాఁడు. తాను మున్ను గంసుఁ బరిమార్చిన విధము వారికిఁ జెప్పుచున్నాఁడు. ఇంక మనము కృష్ణుని బంధించితిమా మన కార్యము నగును. అతనిఁ బట్టి పాండవులకు దిగులు పుట్టింతము. అంతకును దెగక యెత్తివచ్చిరేని యును నిగ్రహింప వచ్చును. కోరలు తీసిన పామేమి చేయును?” ఇట్లు దుష్టాలోచనము సేసి దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులను దుష్టచతుష్టయము మొదలుగాఁగల యవినీతులు దైతేయమర్దను పట్టింప నిశ్చయించిరి.

అయ్యవసరమున సాత్యకి హరిని బట్టు సంకులముఁ గాంచి యూపదఁ బసిగట్టి కృతవర్మను బలగముతో వాకిట నిలువబంచెను. పిదప సాత్యకి జనార్దనున కత్తెఱఁగెల్ల నెఱిఁగించి, యతని యనుమతిఁ గొని కౌరవేశ్వర బాహ్లిక భీష్మ విదురులతో నిట్లనియె :

“అదె కౌరవు లక్షత్రదుర్జనత సేయఁబూని పైఁబొలఁజూచె దరు. శ్రీకృష్ణు నెదుర్కొనుట యనలమునుఁ జీర బంధింపఁజూచుట కాదె ?”

అనిన విదురుఁ డదరిపడి వైచిత్రవీర్యున కిట్లనియె :

“మహారాజా ! నీ తనూభవులు పుణ్యుఁడగు హరిని కేవలము మర్త్యుఁడని యెంచి సమీపించిన మంటపైఁ గ్రమ్ము శలభములవలె

స్రుందిపోరె ? అక్కట ! వారికిని వారివారికినిఁ గాలావధియయ్యెఁ గాఁబోలు.”

అనుటయు గోవిందుఁ డందఱువిన నంబికానందనున కిట్లనియె:

“భూవరా ! నాపైరోషముగల్గి క్రూరతఁ గౌరవు లింతసేయఁ బోవుట సంతోషమే! నా కనుజ్ఞనొసఁగుము. వీరి విద్వేషముఁ జక్కఁ బెట్టి పోయివచ్చెద.”

అనుడు ధృతరాష్ట్రుఁడు ససంభ్రమముగ దుశ్శాసనాది సకల పరిజనమును నా దుర్జనునిఁ దోడ్కొనిర మ్మని విదురునిఁ బనిచెను. విదురుఁడట్లు వారినెల్లరినిఁ దోడ్తెచ్చిన ధృతరాష్ట్రుఁడు దుర్యోధనున కిట్లనియె :

“దుర్మార్గులార ! నీవును, నీ తమ్ములును గొలఁది యెఱుఁగక దనుజారికిట్లు కీడొనరింప నుత్సహించితిరి. గాలినిఁ బట్టఁగలరా ? మహాద్రిఁ గదల్పఁగఁబోలునే ? దవానలుఁ జవురఁగ శక్యమే ? ఏమిసేయుదు. మీరందఱు నశింతురు.”

అనిన విదురుఁడు సుయోధనునితో నిట్లనియె : “బాలకేళిఁ దొడఁగి గృష్ణుఁడెచటెచట నెవ్వరెవ్వరి నేమేమిసేసె వినవె ? ఇట్లేల చెడియెదు.”

అట్టియెడఁ గట్టెదుర నున్న యక్కురుపతికుమారుఁ జక్కఁ జూచి “ఏ నొక్కరుఁడనయని తలఁచియే దుర్మదమునఁ బట్టనుత్సాహముసేసితి” వనుచు దరహాసముసేయు వాసుదేవుని ఫాలప్రదేశమున బ్రహ్మయు, వక్షమున విరూపాక్షుఁడును వదనమ్మున వహ్నియు,

పార్శ్వముల నింద్ర యమవరుణ కుబేరులు నుద్భవించిరి. హాలగాంఢీవ మండితబాహులగు బలదేవార్జునులు సవ్య దక్షిణభుజములను, నిజాయుధహస్తులగు యుధిష్ఠిర భీమ నకుల సహదేవులు వీపునను, వివిధ ప్రహరణపాణులగు యదువృష్ణి భోజాంధకవీరు లూరులనుఁ బ్రభవించిరి. జనితనానాహస్త విన్యస్తములయి శంఖచక్ర గదాఖడ్గ శక్తి శార్ఙ్గప్రముఖనిఖిల సాధనములు వెలిఁగె. నేత్రశ్రోత్రనాసావివరముల సధూమ ధూమకేతు జ్వాలాజాలములు నిగిడె. రోమకూపకలాపములఁ దరణి కిరణప్రభలువెడలె. ఇట్లు దుర్నిరీక్ష్యమగు నత్తేజోరూపముఁ గనుఁగొనఁజాలక సకలజనములు నయనములు మొగిడ్చి కదలకుండనుండె. కృష్ణుఁడు నారదాది మహామునులకును, భీష్మ ద్రోణ విదురులకును దివ్యదృష్టిఁనొసఁగె. ఆ పుణ్యపురుషులు సాంద్రానందమునఁ దేలుచుండిరి. దేవతలు పూలవానఁ గురిపించిరి. జయ జయ శబ్దములు దిక్కులనిండెను. అప్పుడు ధృతరాష్ట్రుఁ డమ్మహాసంకులము విష్ణుని దివ్యవిజృంభణముగా నెఱిఁగి

"కరుణింపుము, సంశ్రితభయహరణ ధురీణా! అజ్ఞానమును సహింపుము. శరణము వేఁడెదను. భవచ్చరణము గనుఁగొనఁ గన్నులఁ బ్రసాదింపవే"

అని వేడుటయు, దయార్ద్రచిత్తుఁడగు శ్రీకృష్ణుఁడజ్జనపతికి దృష్టి నిచ్చెను. ధృతరాష్ట్రజనపతియు శ్రీకృష్ణుఁగని భక్తినొక్కి- "పురుషోత్తమా! నిన్నుఁగని కృతార్థుఁడనైతిని. ఇంకనొరులఁ జూడనొల్లను. లోచనముల నుపసంహరింపవే" యని ప్రార్థించెను. సితవిశాలాక్షుఁడగు

ధృతరాష్ట్రుఁజూచి సభ్యులెల్లరు నాశ్చర్య నిమగ్నమానసులైరి. తద నంతరము ధృతరాష్ట్రు నభిమతమున నతని కన్నులెప్పటియట్ల కావించి నిజవిశ్వరూప ప్రపంచము నుపసంహరించి మునీంద్రుల నామంత్రణము సేసె. అమ్మహాత్ములంతర్ధానమొందిరి. తానును సముత్థానంబుసేసి యంతకుమున్న సన్నిహితులై యున్న కృతవర్మకరమును, సాత్యకి హస్తమును నవలంబించి శ్రీకృష్ణుఁడు సభాస్థలమును విడిచి నిజనివాస మున కరిగెను.

---

# రా య బా ర ము

## చ తు ర్థా శ్వా స ము

కృష్ణుఁడట్లేఁగగున వెడలిన విస్మితులై గాంధారి యభ్యంతర మందిరమున కరిగెను. కౌరవులెల్లరును బంధుమిత్త్రసహితముగాఁ దనతోడన వెడల, మొగము గంటువెట్టుకొని కక్ష్యాంతరములు గడచినప్పుడు, దారుకుఁడు తేరినొగలపైనుండి పొడసూపి కేలు మొగిడ్చి ఫాలభాగమున గదియించినఁ దత్ప్రదేశమున నిలిచి యాంబికేయుఁడు పుండరీకాక్షుఁ జేరి నిజతనూజుల నుపలక్షించి :

"శ్రీకృష్ణా! వీరును బాండుపుత్త్రులును వైరముఁ దక్కి- పొసగియుండుటకై నాసన్నిధిని నీచెప్పిన హితవచనములు వింటివి కదా! నేను నిర్దోషుఁడనని నీవెఱిఁగిన నాకంతియుఁజాలు."

అనిన విని యచ్యుతుఁడు బాహ్లీక భీష్మద్రోణ కృపప్రముఖ నిఖిల విశిష్టజనముల నాలోకించి,

"ఇప్పుడీ సభను జరిగినదంతయు మీకుఁ దెల్లమేకదా! ధృతరాష్ట్ర భూపతియుఁ దనకేమియుఁ బ్రాముఖ్యము లేదనియుఁ, దనదెస నెట్టి తప్పును లేదనియుఁ జెప్పి విడిచి పుచ్చెను. కావున నాకు నిచ్చోటఁ దడయఁ బనిలేదు, పోయివచ్చెదను. ధర్మపుత్త్రునకు వృత్తాంత మెఱిఁగింపవలయును." అని పలికి వారల నామంత్రణము సేసినవాఁడై రథారోహణము సేసెను. ధృతరాష్ట్రుఁడును నచటి

జనములను వెనుకకు మరలిచి. శ్రీకృష్ణుఁడును కుంతీగృహాభిముఖుఁడై యరిగి, కుంతీ గృహద్వారమున వరదమూడిగ్గి వారందఱుఁ దనతోడన నాలుగుచుండ నరుగుదేరఁ గృహముఁ బ్రవేశించి వినయభూషణుఁడగుచు కుంతీ చరణాంబుజములకు కెఱఁగెను. పిదపఁ గుంతీదేవితోఁ గౌరవసభఁ జూచినాడిన గౌరవవాక్యములను, దుర్యోధనుఁ నల్పవచనపద్ధతియుఁ బాండవాయాసహిమ తెలియఁగించి మాధవుఁడు మఱియు నిట్లనియె :

"కురుకుమారులు రాజ్యసుఖము నంతయు ననుభవించి క్రొవ్వి క్రొంగువిూ వెఱుఁగకున్నారు. వానివలన మాకు కల్గు నష్ట మేమి? ఒకవిధముగ మాకిది మేలే యయినది. అజ్ఞానానలము వారిని దగ్ధ మొనర్చును. ఇంక పాండుకుమారులకు లక్ష్మి బోయివచ్చెడును. వారి కుచితహితవచనము లొసగితిన్" అనిన నట్టివి విక్రమోపజీవులైన ముచుకుందాదులను సృంజయాదులను నను తొంటి నరపతుల చరిత్రములు చెప్పి యెల్లవారును వినుచుండ వెండియు నిట్లనెను :

"రాజులకు పరాక్రమజీవనవృత్తి దక్క మఱొకవృత్తి నిషిద్ధ మని మును లందురు. ఉత్తమసత్త్వులు వంశధర్మములను పూజితమగు రీతిని నిర్వహింతురు. బుద్ధిహీనులు వానిని విడిచి నిస్తేజపుఁగూటి కియ్యకొని దీనతఁ జెందుదురు. కృష్ణా! కౌరవ పాండవులకు నెయ్యము కూడకుండునట్లు చెప్పుము. నీవు కాకుండుటయె మేలయ్యె. పోయిరమ్ము. నిజభుజార్జితముగు పితృవృత్తమున నర్జునుఁ డుత్సాహముఁ జూపకపోయిన దైన్యము వాటిల్లక యేమగును? సర్వజగ

న్మాన్యుఁడవగు నీ విందు రాఁ దగునె ? ఐనను విధివశంబు నెవ్వరు దప్పింపఁగలరు ?"

అని యంత నిలువక కుంతి యిట్లనియె :

"కొలువున ద్రౌపదిఁ బఱపిన బన్నమును మఱచిరె ? ధర్మ పథముఁ దప్పకుండుట కప్పటి కది తగును. ఇప్పుడైనను నసుముకట్ట వలదా ?" అని పలికి, పుండరీకాక్షుఁ గౌగిలించుకొని యచ్యుతుఁడు మ్రొక్కి—న దీవించి, "నేను సుఖముగ నున్నదానవని పాండవులకుఁ జెప్పుము. వీరోచితముగుజీవనమున బ్రదుకుఁ డనుము. పోయిరమ్ము." అని వీడుకొల్పిన రథారోహణముసేసి గోవిందుఁడు కర్ణుదెసఁ గను గొని "న న్ననిచివత్తుగా ని రమ్ము"ని కరంబు సాచి, చెయి పట్టి తన యరదం బెక్కి—ంచుకొని, సాత్యకి వేసరము నెక్కి— వెంట వచ్చుచుండ, యనుపవచ్చిన కృతవర్మ నుచిత ప్రకారమున సస్నేహముగా నిలిపి పుండరీకాక్షుఁడు పురంబు నిర్గమించెను.

ఇట ధృతరాష్ట్రుఁడును మగిడి కొలువుకూటమునకువచ్చి మాట లాడుచున్న సమయమున సుయోధనుతో భీష్మద్రోణు లిట్లనిరి:

భీష్మద్రోణుల హితవు

"కుంతిమాటలు విని మేము బమ్మెరపోతిమి. కుంతియుఁ బుణ్యుఁడగు కృష్ణుఁడును శాంతివాక్యములు పలుక—వారిట్లు పలుక—ట చిత్రమే ! దీనివలన ధర్మజవారిరాశికిఁ జెలియలికట్ట తెగినది. మన మిప్పుడు చేయఁదగిన దెద్ది ? "

అని పలికి వెండియు,

"మాకుచితమగు కార్య మిది: ధర్మప్రీతిని నీవేగి సుశ్లోకుఁ
డై సంయుధిష్ఠిరుఁ గని జనస్తుత్యముగ శాంతిపై నీ కౌరవులఁ గాచి
కొనుము. ఎందును దర్ప మొప్పదు. సుయోధనా! తుదిని శోకముఁ
బొందక వేగముగఁ గృష్ణుఁ గూడఁబొమ్ము."

అనిన విని దుర్యోధనుఁడు మొగము రాఁజుచుండ నూరకుం
డెను. గాంగేయుఁడును గురుఁడును దిగ్గన లేచి యతని నవలోకించి:

"కురునృప! వినుము. మేము సంసారము దరిద్రొక్కిన
వారము. ఇంకను సంగరమునకుఁ దలఁకెదవే! మేము నీ కోసము
నీ పక్షమున కొరగితిమి. ఎట్లైన నగుగాక. మేము పోయెదము."
అనుచు నరిగిరి - రాజును సభ్యంతరమునకుఁ జనియె. సుయోధనుఁడు
బహిఃపరివారముఁ బొమ్మని హితపరిజనుఁడై యాత్మభవనమున
కేఁగెను.

* * *

అచ్యుతుఁ డట్లు పురము నిర్గమించి యధికసంప్రీతి దలఁకొన
వర్కజు నాననం బవలోకించి, యన్యు లెవ్వరు వినకుండ నతనితో
నిట్లనియె :

*శ్రీకృష్ణుఁడు కర్ణుని పాండవపక్షమునకుఁ బిలుచుట.*

"కర్ణా! నీవు వృద్ధజనోపసేవివి, ధర్మ సంవేదివి.
నీకొక్క రహస్యముఁ జెప్పెద వినుము. సిద్ధమంత్ర
బలమున మార్తాండువరమునఁ గుంతి కన్నియగా
నుండినపుడు నీవామెకుదయించితివి. దాన నీవు పాండునృపాలు నగ్ర

సుతుఁడవు. ఇందధర్మమెగ్గియు లేదు. ధర్మతనయాదులగు నీ తమ్ములు నీయడుగుల కెఱఁగి సకల పుత్త్ర మిత్త్ర బంధు సేనాసమేతముగఁ గొలిచి నీకుఁ బట్టముఁ గట్ట నుజ్జ్వలుఁడ వగుదువుగాని రమ్ము. నేను నిన్ను సామ్రాజ్యమునకు నభిషిక్తుఁ జేయుదును. నీవు దొరవై వెలసిన నప్పటి మహోత్సవమునకు యువరాజై యుధిష్ఠిరుఁడు నీరథమున నుండి నీకు ధవళచామరులు వైచును. వాయుపుత్త్రుఁడు సితచ్ఛత్త్ర ముఁబట్టును. సవ్యసాచి సారథ్యము సేయును. మఱియుఁ బాంచాల యాదవ పాండ్యమాత్స్యులులోనుగాఁగల రాజలోకముతోడఁ గవలు నభిమన్యుప్రభృతికుమారులును మేమెల్లరమును బరివేష్టించి వత్తుము. ఇట్టి మహేంద్ర విభవమున మహనీయుఁడగుచు మహీచక్ర మేలుము." అని చెప్పి మఱియు,

"పాంచాల రాజపుత్త్రియు నిన్నుఁ బొందును. ఏవిధిని సందేహింపక పాండవ పక్షమునకు రమ్ము. అట్లైనఁ గుంతికిని సమస్తబంధు మిత్త్రులకును బ్రియమగును."

అనిన విని రహస్యముగ రాధేయుఁడు మాధవున కిట్లనియె :

"నాజన్మ వృత్తాంతమింతకు మున్నేను వింటిని. నన్నుఁగని కుంతి నదిలో పారవైచిపోయెను. తనకుఁ గొడుకులు లేకపోవుటచే సూతుఁడు నన్నుఁ దెచ్చి తనభార్య కిచ్చెను. ఆమెయు నన్నుఁ బ్రియత్నముతోఁ బెంచి పెద్దగావించెను. ఇంతకాలము వారు మూత్రపురీషాదులు దమ గాత్రములందింకి గారవముతోఁ బుత్త్రునిగా

నన్నుఁ బెంచిరి. నే నిప్పుడు వారిని విడుచుట తగునే? వృద్ధోపసేవ నమును ధర్మసంవేదనమును నాకుఁ గలవని నీవ చెప్పితివి. రాధయు భర్తయు నాకు జాతకర్మాది సమస్త సంస్కారములు నిజకులో చితముగ నాచరించిరి. అట్టి తల్లిదండ్రులకుఁ బుత్రకృత్యములు నిర్వ ర్తింపక, వారలఁ బాసి యేను వచ్చుట ధర్మమగునే ?"

అని పలికి వెండియు,

"నాకుఁ బెక్కుర సోదరులును బ్రియులును ననుజులునుఁ గలరు. వారి నందరిని విడుచుట తగదని చెప్పక న న్నిట్లు పిలుచుట, కృష్ణా! నీ కుచితమే? అదియుఁగాక వీఁడు సూతసుతుఁ డనక, తన తమ్ముల కంటెను, తన సూనులకంటెను నెక్కుడ సంప్రీతి న న్నాద రించి, నన్నుఁ దనయంతవానిఁగఁ జేసిన కురుకులేశ్వరునిఁ బాయఁగలనే?

"నే నగ్గమున కేగరని సుయోధనుఁడెంతయు నమ్మియున్నాఁడు. అతని నమ్మకమును వమ్ముసేసి పాండవులఁ జేరుట నా కుచితమా?

"నే నగ్గమని యుద్ధమునఁ దలపడకపోయిన జనులు నవ్వి పోరే? ఇది మా యిద్దరికిని యశఃకీర్తికరము.

"శ్రీకృష్ణా! నీ వతి నిర్మలబుద్ధివగుట హిత ముపదేశించితివి. ఐనను నిది నా బుద్ధి కెక్కదు. కాని నీవు రహస్యమును రక్షితముగఁ బాటింపవలెను. ఎందుకన ధర్మతనయుఁడు దాను నా తమ్ము డగుట యెఱిగెనేని సామ్రాజ్యము నొల్లఁడు. ధర్మజుఁడట్టి ధార్మికుడు శాశ్వత ముగ వసుధ నేలుట భావ్యముకాదె ?

" అనుజులు ఋత్విజులుగ నీ పుత్రద్రష్టగ రణయజ్ఞమునం దతఁడు కురుకుమార పశువిశసనముఁ జేయఁగలఁడు. దానం బుణ్యభూమి యగు కురుక్షేత్రమున సముఖోగ్ర [illegible]రును సద్గతి వడయుదురు. "

అనిన విని వాసుదేవుఁడు సూతనందనున కిట్లనియె:

" నామాట కియ్యకొనకుంటివి. గర్వము తుదకు సంతాపముఁ దెచ్చును. అర్జునునితో మాత్సర్యమునఁ బరాజయమో మృతియో తప్పదు. పెరకంత్ర కట్టి గతికల్గిన గాని నీ మనస్సు శాంతింపదు.

" గాండీవాది యఖండ దివ్యాస్త్రములు ధరించి నే నొగలపై నుండ నీకు నరు నెదురఁ దరమే ?

"జ్ఞాపకముంచుకొనుము. ఎట్లైనను పాండవులకు విజయము తప్పదు. నీ విక పొమ్ము. సుయోధనునకును, గురుభీష్ములకును, మీకుఁ దోడువచ్చిన రాజుల కందరకునుఁ జెప్పుము. ఈ మాసము సౌమ్యమై శీతోష్ణములు లేక పుష్పఫలోపేతమును, సమగ్రధాన్యమును, సులభయవసైంధవంబును నగుచు నొప్పి యున్నయది. ఏ డెనిమిది దినములకు నమావాస్య వచ్చును. అది పుణ్యదినము. నాఁడు భండనము కావలయును. "

అనినఁ గానీనుఁడు కమలనాభున కిట్లనియె:

" కౌరవపాండవులకు యుద్ధము తప్పదు. యుధిష్ఠిరునకే గెలువగు ననియు నెఱుఁగుదును. నీవు చెప్పనక్కఱ లేదు. అందుచేతనే నే నందు రా నంటిని. "

అని పలికి మఱియును,

"దీనికిమూలము నేనును శకునియు, దుశ్శాసనుఁడును. వారు పాండవులఁ గలసినగాని నాకు రారాదు.

"కృష్ణా! ఈ సమరసముద్రము దఱియునేఁడి నిన్నుఁగనియెద. కాదేని యూర్ధ్వలోకమునఁ గాంచెద. నీవింక నేమియుఁ బలుకకుము. వనివినియెద" నని కౌఁగిలించుకొనిన "అట్లకాక! పొమ్ము" అని కృష్ణుడు వీడుకొలిపెను. రాధేయుఁడు రథావతరణముసేసి కనకరత్నమయమగు తన యరదమెక్కి కరిపురమున కరిగెను. అచ్యుతుఁడును సాత్యకినిఁ దన రథ మెక్కించుకొని దారుకుఁజూచి "పదపద, పోనిమ్ము పోనిమ్ము"ని పలికి లలితాటోపకలితుండగుచుఁ జనెను.

శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుఁ గౌరవ సభం బుట్టిన విశేషములు దెల్పుట.

వాసుదేవుఁ డిట్లుచితప్రయాణముల నుపప్లావ్యమునకుఁ జని ధర్మతనయుచేతఁ బూజితుఁడయి, భీమసేనాదులు విరాట ద్రుపద ముఖ్యులగు తగువారుఁ దన్నుఁ గాంచిన వారినెల్ల నభినందించి కొలువుననుండి యుధిష్ఠిరునితో నిట్లనియె :

"ధార్తరాష్ట్రులున్మత్తులు. తగిన పలుకులు విని సంధిసేయుట కేల యిచ్చగింతురు. తమ శక్తియు, నెదిరిబలమును నెఱఁగిన వారైన చో నాఁడు వారంతలంతలు చేసియుందురే?"

అని వారందఱును వినఁ దనపోయివచ్చిన కార్యము తెఱఁ గెఱఁగించి పథిశ్రమము పుచ్చువాఁడై నిజమందిరమున కరిగెను.

నాఁటి రాత్రి ధర్మనందనుఁడనుజ సహితముగ సుదితప్రవేశనమున నుండి గోపుండుని రావించి,

"నీవు సుయోధనుతో నెట్లు బలికితివి? అతఁడెట్లు బదు లిచ్చెను?" అని యడిగిన నచ్యుతుఁ డిట్లనెను:

"యుద్ధము కానివిధమున నెయ్యమునుగు నట్లు పలికితిని. నది యుచితమో, యేది యనుచితమో యేర్పఱచెప్పితి. బహువిధములఁ బలుకు నా పలుకులెల్ల దుర్యోధనుఁడు చెవిచెన్నుఁగెట్టి గుణాఱితో బలు పలుకుమాటలెచ్చి యుపహసించెను. ఇఁక నొయ్యమాట లేల?"

అనిన విని ధర్మనందనుఁ డిట్లను:

"అప్పుడు ధృతరాష్ట్రభూపతి యుచితమగుమాటలఁ జెప్ప లేదే? భీష్మ ద్రోణ విదురులును, నితరులగు పెద్దలును బుద్ధిసెప్పరే?"

దానికి శ్రీకృష్ణుఁడు,

"ధృతరాష్ట్రుఁడు సభ్యావమున నానావిధములఁ జెప్పెను. కాని దుర్యోధనుఁడు వినఁడాయెను. ధృతరాష్ట్రుఁడు జాత్యంధు డగుటయు, సామ్రాజ్యమునంతయుఁ బాలించి పాండుసృపాలుఁడునుఁ గొలిచియుం డుటయుఁ, గురుకులమునకెల్ల తేజముగా మీరు దిగ్విజయముసేసి సంగ్రహించిన సిరి వారు వంచనమెయిఁ గొనుటయు, సత్య మకుంఠిత మున నీవు సమయంబు నడపిన విధమును, నన్యాయమునఁ గొరవులు చెఱుదురనియు ముగమోట మెంతమాత్రమును లేకుండఁ బెద్దలెల్లఁ జెప్పిరి. ఆ మాటలు దుర్యోధనునకు రుచింపక యతఁడనుజ గర్వసహిత

ముగ సభ విడిచి పోయెను. ఇట్లు కొడుకు ముష్కరుఁడై యరిగిన ధృతరాష్ట్రుఁడు గాంధారి రావించి విదురుఁ బంచి దుర్యోధను రప్పించెను. గాంధారియుఁ బుత్రున కుపదేశించెను. ఎవ రెంత చెప్పినను వినక దుర్యోధనుఁడు దనవారి నెల్ల గురుక్షేత్రమునకు నడువుఁడని చెప్పించెను. భీష్ముఁడు సేనాధిపతిగ నెత్తివిడియును. ఇది ధార్తరాష్ట్రుల నిశ్చయము. నేనును నా చేసినంతమట్టుకు సామవాదము లాడితిని. నారదాది మహామునులచేఁ జెప్పించితిని. ఏమి చెప్పినను నెంతట పోకున్నఁ జూచి గినుకఁ దెచ్చికొని, బంకించియు, భంగించియు, ధిక్కరించియుఁ, దృణీకరించియుఁ జూచితిని. కార్యము భగ్నమగుట వెండియు శాంతవచనములు బల్కితిని. అతఁ డశక్తి దుర్జనతఁ జేయఁజూచిన నమానుషము లగువానిఁ గొని చెడమాయలఁ దలఁచినం బెకుకపోకలఁ బోఁగుతిని. ఎన్ని భంగుల సంధియ కావలయునని పోరలంగల యంతయుఁ బోరలితిని. అ ప్పాపాత్ముఁ డెట్లునుఁ జిక్కంబడక తన చలంబుతో నీ ప్పొట్టిపోరలయ్యుఁ గయ్యముఁ జేయును గాని యెంతమాత్రమును రాజ్యము పాలిచ్చువాఁడు గాఁడు. కౌరవుల యెడ దండముతప్ప వే రుపాయము లేదు. ఇఁక మీకు నచ్చిన తెఱఁ గొనరింపుఁడు."

అనియె. ధర్మతనయుఁడు దమ్ములఁ గనుఁగొని యిట్లనియె

"కురుసభ జరిగిన దంతయు కృష్ణుఁడు చెప్పెను. ఇఁక నను మానింపక యుద్ధమునకు సన్నద్ధులు గండు."

అని పలికి యజాతశత్రుఁడు కరుణాయత్తచిత్తుఁడై యచ్యుతు నాలోకించి :

"కురువంశమునుఁ ద్రుంచుటకు నా మనస్సొప్పకున్నది. పొందు సంపాదింప వేరొక యుపాయము లేదే? కృష్ణా! నా మనసునుఁ దమ్ముల తలఁపును నీ వెఱుఁగుదువు. ధార్తరాష్ట్రుల చందమును, భీష్మద్రోణవిదురాదుల చిత్తములును నెఱింగి వచ్చితివి. మాకు ధర్మచ్యుతి లేకుండునట్టి కార్యము నిశ్చయింపుము."

అనిన శ్రీకృష్ణుఁ డిట్లనియె :

"యుద్ధముతక్క వేరొక యుపాయము లేదు. దుర్యోధనుఁడు హితవచనములు వినకపోవుటయేకాక, నన్ను బద్ధునిఁ జేయఁ జూచెను. అట్టి యసంబద్ధునితో సంధికి నుపాయము నా కెద్దియుఁ దోఁపదు." అని చెప్పి విదురుఁడేకాంతమున నాడినమాటలును, భీష్మద్రోణబాహ్లికాదు లగు పెద్దలకు ధార్తరాష్ట్రులదెసఁ బుట్టిన మనఃక్షోభమును, కుంతి కౌరవులు వినఁ బలికిన పలుకులునుఁ బ్రకటించి, ధర్మపుత్త్రుడు కల్మషుఁ డగుటఁ దెలిపి సమరం బవశ్యకర్తవ్యముగ నిశ్చయించెను. అట్టియెడఁ దమ్ము లన్నమొగమునఁ జూడ్కి నిలిపి యూరకుండిరి. అప్పుడు ధర్మజుఁడు దమ్ములఁ జూచి :

"హితమును ధర్మమును నెద్దియో మీరింక నిర్ధారణసేయుఁడు"

అనిన విని యర్జునుఁ డతని కిట్లనియె :

"హితమును ధర్మమును నిదియని యే మెఱుఁగుదుము?

అచ్యుతుఁడు సమస్తధర్మపరిశోధకుఁడు. విదురుఁడును గుంతియుఁ బలికిన పలుకుల సర్వసందేహములునుఁ బోయినవి. శ్రీకృష్ణుఁడు 'రణము సేయుఁడు' అని యాజ్ఞాపించిన నింక వేరు విచారమేల ?"

అనిన ధర్మజుఁడు :

"అట్లకాక. శౌరి యఖిలధర్మజ్ఞానఘనుఁడు. మనకేడుగడ. అతఁడు నిశ్చయింప సంశయమేటికి ? ఇంక యుద్ధమునకు సర్వము సన్నద్ధ మొనర్పుఁడు."

అని యుధిష్ఠిరుఁడు యుద్ధము కర్తవ్యమని నిశ్చయించెను.



లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి.